# చిత్రాభ్యుదయము.

మహాకవి

శ్రీ॥ శ్రీ॥ కాళ్లకూరి నారాయణరావుగారిచే

రచియింపఁబడి.

తత్సోదరులగు

కాళ్లకూరి భోగరాజుగారిచే

ప్రకటింపఁబడినది.



రెండవకూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

శ్రీ లక్ష్మీ ముద్రణాలయమున ముద్రితము.

1932.



[వెల రు 1—0—0.

# పాత్రముల వివరములు.

## —♦ పురుషులు ♦—

రాజరాజనరేంద్రుఁడు — కథానాయకుని తండ్రి.

యువరాజు — కథానాయకుఁడు (సారంగధరుఁడు)

గుణదేవుఁడు — రాజరాజనరేంద్రుని ముఖ్యమంత్రి.

హరిశర్మ — ,, ద్వితీయమంత్రి.

సుబుద్ధి — కథానాయకునిమంత్రి (గుణదేవుని కుమారుఁడు)

విశారదుఁడు — చిత్రప్రదర్శకుఁడు.

సువేగుఁడు — యుద్ధభటుఁడు.

వామనుఁడు — రాజసేవకుఁడు.

వైశ్వానరుఁడు — కథానాయకుని వేడుకచెలికాఁడు.

న్యాయాధిపతి ముఖ్యన్యాయాధిపతి.

వామదేవుఁడు, విద్యాధరుఁడు — న్యాయవాదులు.

పాలకుఁడు — న్యాయస్థానభటుఁడు.

దండపాశికుఁడు — రాజకీయోద్యోగస్థుఁడు.

రోషణుఁడు, ఘోషణుఁడు — రాజభటులు.

దమనుఁడు — మీననాథుని శిష్యుఁడు.

సూత్రధారుఁడు — అంతర్నాటకమును నడుపువాఁడు.

మీననాథుఁడు — ఒకముని (రాజగురువు)

## —♦ స్త్రీలు ♦—

చిత్రాంగి — కథానాయిక.

లలితాంగి, సుందరాంగి — కథానాయిక సఖులు.

రత్నాంగి — కథానాయికని తల్లి.

పుష్పాంగి — రాజపరిచారిక.

# పీ ఠి క.

---

ఈనాటక మిదివఱకే అనగా 1909 సంవత్సరమున మహాకవిచే రచియింపఁబడి ప్రకటింపఁబడెను. కాని యిందువచ్చు పాత్రములసంఖ్య హెచ్చగుటచేతను- కథాభాగము చాల హెచ్చుగా నుండుటచేతను బ్రదర్శనమున కనుకూలముగాక- చదువుకొనువారికి మాత్రము చాల యనుకూలముగా నుండెను. ఆకారణమున నాటకసామాజికులు చాల మంది నాటకప్రదర్శనమున కనువగునట్లీ చిత్రాభ్యుదయమును మార్పఁ జేయవలసినదని కోరగా- నామహాకవియే దీనిని గొంత తగ్గించియుఁ గొంత చేర్చియు మఱికొంత మార్పఁజేసియుఁ బాత్రముల యందును గథాభాగము నందును గూడ నాటకప్రదర్శనమునకుఁ జాల ననుకూలముగాఁ జేసెను. కాని దీని నచ్చొత్తించక పూర్వమే మత్సోదరులగు యామహాకవి యీలోకమును విడుచుటచే దానినే యిపుడు నే నచ్చొత్తించి ప్రకటించితిని. ఇంకను నిందుఁ బ్రదర్శనమున కనుకూలములేవైనను న్నచో దయయుంచి తెలిపిన మూఁడవకూర్పునందు సవరించుకొందును.

☞ ఈనాటకమును లిఖితరూపకమైన నాయనుమతి లేనిదే ప్రదర్శింపఁగూడదు.

కాకినాడ,<br>3-4-32

ఇట్లు,<br>కాళ్లకూరి భోగరాజు.

# అవతారిక.

**రామచరితము** వలెనే సారంగధరచరితము ప్రబంధము మొదలు గొల్లసుద్దులవఱకు ననేక రూపముల వెలసి మిగుల వాడుకలో నున్నది. కాని పవిత్రతయందు మొదటిదానికిని దీనికిని మిక్కిలి వ్యత్యాసము కలదు. రామచరితము సదా స్మరింప వలసినదిగా నుండ సారంగధర చరితము సర్వదా విస్మరింప వలసినదిగా నుండెను. తారాశశాంక- చిత్రాంగీరాజరాజనరేంద్రుల చరితములను, మొదట నేమహానుభావుఁ డెందులకుఁ గల్పించెనో- తరువాతవారైన దేశమునకెల్ల లజ్జాకరము లైన వీని నడఁగఁద్రొక్కక వివిధరూపముల నేల విస్తరిల్లఁజేసిరో- నే నూహింపఁ జాలకున్నాఁడను. తారచరితమునకుఁ బురాణాధారమైనఁ గలదు; చిత్రాంగి చరితమునకుఁ బుక్కిటిపురాణముదక్క మూలమేమి యుఁ గానఁబడదు.

మన కవులలోఁ జాలమంది యేదియో యొకవిషయమును మనసున నుంచుకొని- యితరానర్థముల నూహింపకయే- గ్రంథముల వ్రాయు దురాచారము మొదటినుండియుఁ గలదు. విప్రనారాయణచరితము ను విలోకింపుఁడు. తద్గ్రంథకర్త భగవంతుఁడు భక్తవత్సలుండని నిరూపింపఁబూనుకొని- విప్రనారాయణుఁడు వివేకమంతయుఁ బోఁగొట్టుకొని, వేశ్యావియోగమునకుఁ జింతించుచుండ భగవంతుఁడు చౌర్యము సలిపి మరల నతని నవ్వేశ్యకుం దార్చె నని కల్పించెను. ఇది యెంతనీతిదాయక ముగా నున్నదో విలోకింపుఁడు !

విమర్శించి చూచినచో, మనగ్రంథములలో ననేకము లీతరగతి లోఁ జేరునవియు, నింతకంటెను బాడుతరగతిలోఁ జేర్పఁబడఁ దగిన వియుఁ గూడ నైయున్నవి. కావుననే మన గ్రంథములయందు మనవారికి సయిత మాదరబుద్ధి తగ్గిపోవుచున్నది. సారంగధరచరిత్రముకూడ నాతర .గతిలోనే చేర్పఁదగినదా ? లేక సమస్తజనాదరణీయమైన నీతి యెద్దియేని

బోధించుటకుఁ గాని యథార్థమగు చరిత్రము నెల్లడించుటకుఁ గాని. రచియింపఁ బడినదా? యను విషయ మిప్పుడు విచారింపవలసి యున్నది.

ఇందు మనము నేర్చుకొనఁ దగిననీతి విశేష మెద్దియుఁ గానం బడుట లేదు. చిత్రాంగి యెంతనిర్బోధించినను సారంగధరుఁడు చలింప కుండె ననుట నీతి కాదా యందు రేమో? మాతృజనముకడను, దత్స మానులకడను మతియొకఁడు మాత్రము చలించునా? పరవనితలకడఁ జలింపకుండినచో నెన్నఁదగును గాని యిం దంతవిశేష మేమియు లేదు. వెదకిచూచినచో, నొకవేళ నింతకంటెఁ జెప్పఁదగిన నీతు లొకటి రెండు దొరకిన దొరకవచ్చును. పరిశీలించినచో నేదియో యొకనీతి యెందు లేకపోవును? కాఁబట్టి యంతమాత్రమున నిది నీతిబోధకై రచింపఁ బడిన గ్రంథముగా నెంచుట కవకాశము లేదు

ఇఁక యథార్థవిషయ మనుట కేమేని యవకాశము కలదేమో విచారించి చూతము. అట్టి విచారణమునకుఁ జేమకూర వెంకటకవివిర చితమగు పద్యకావ్య సారంగధరచరిత్రమును బొణాల శంభుదాసకవి కృత మగు ద్విపద సారంగధరచరిత్రమును ముఖ్యాధారములై, సిద్ధకవి కృత మగు యక్షగాన సారంగధరచరిత్రమును అప్రకాశితమును సహకార ములుగా నేఁటుపడుచున్నవి.

1 పద్యకావ్యమునందు

“ గీ॥ మహిని రాజనరేంద్రుఁడు • మాళపతి
రాజరాజనరేంద్రుఁడు • రాజరాజు
ననఁగఁ బేరెన్నికకు నెక్కి • యలరుచుండు
నింద్రవిభవుండు రాజమహేంద్ర విభుఁడు ”

అని రాజరాజనరేంద్రుఁడు మాళవదేశమునందున్న రాజమ హేంద్రవరమున వసించుచు, మాళవమును బాలించినట్లు చెప్పంబడి యుండెను.

ద్విపదయందు,

" వంతుకెక్కిన సోమ♦వంశంబునందు♦శంతనుఁడనుకీర్తిశాలి ♦ జన్మించె
ననమానజయశాలి యగుశంతనునకు, వెసరాజమణిచిత్రవీర్యుఁడుపుట్టె
నతనికిఁ బాండురాజావనిపతియు, పతి కర్జునుం డనుబలుఁ డుద్భవించె
నలయర్జుననిసూనుఁ డభిమన్యుఁడనఁగఁ, జెలఁగెవానికి బరీక్షిత్తుజన్మించె
నయగుణోన్నతునకానరనాథునకును, జయశాలియైపుట్టెజనమేజయుండు
నతనికిఁబుత్త్రుఁడై యవనిజనించెఁ, జతురుఁడురాజరాజనరేంద్రుఁడనఁగ"

అని రాజరాజనరేంద్రుఁడు జనమేజయుని కుమారుఁడుగాఁ జెప్పంబడియెను. వీనివలన నతని నివాసస్థలము హస్తినాపురమనియుఁ బాలించినది కురుదేశమనియుఁ దేలుచున్నది !

యక్షగానమునందు దీనికి బదులుగా:—

" ద్వి. అరయంగ నిలహస్తినాపురంబనెడు, పురమందు వెలసిన భూలోక విభుఁడు, రాజశేఖరిసుచంద్రవంశజుఁడు, రాజనరేంద్రుఁడు...  ...."

అని చెప్పంబడి యున్నది.

అప్ప కవీయమునందు:—

"క. అవధారు శబ్దశాసనుఁ
డవనిఁ గలియుగమున కాది ♦ నారాజమహేం
ద్రవరమునఁ జెప్పిన యాం
ధ్రవచోవ్యాకరణసూత్ర♦తతిఁ దెనుఁగింతున్ "

అని రాజరాజనరేంద్రుఁడు కలియుగాది నున్నట్లు చెప్పఁబడి యున్నది.

దేశచరిత్రములయందు వీనికన్నిటికిని బాధకముగా, రాజరాజనరేంద్రుఁడు విమలాదిత్యుని కుమారుఁడనియుఁ గ్రీస్తుశకము ౧౦౨౨వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడై రాజమహేంద్రవరము రాజధానిగా నాంధ్రదేశమును బాలించెననియుఁ జెప్పంబడియె. దీనింబట్టి సారంగధర

చరిత్రకారులచేతను, అప్పకవిచేతను జెప్పఁబడిన రాజరాజనరేంద్రుఁడు వేఱనియు, దేశచరిత్రకారులచేతఁ జెప్పఁబడిన రాజరాజనరేంద్రుఁడు వేఱనియుఁ గాని- సారంగధరచరిత్రకారులకును. అప్పకవికినిగూడ రాజరాజనరేంద్రునింగూర్చి యించుకయుఁ దెలియదని కాని యూహింపవలసి యున్నది.

2 పద్యకావ్యమునందు:—

"క. కల రాయిలరాయనికిం
గులసతి రత్నాంగి భోగ♦కుటిలశిరోజా
తిలకము చిత్రాంగియు నన
నెలజవ్వను లిరువు రంబు♦జేందునిభాస్యల్"

అని చిత్రాంగి రాజరాజనరేంద్రుఁ డుంచుకొనిన వేశ్యగాఁ జెప్పఁబడెను.

ద్విపదయందు:—

"చిత్రాంగుఁడను రాజశేఖరు కూఁతు, పుత్రిక చిత్రాంగి..."

అని యామె పాండ్యరాజపుత్రికగాను,

"పరికింప రత్నాంగి పట్టపుదేవి, మురిపెపుఁజిత్రాంగి ముద్దులభార్య"

అని యామె రాజునకు రెండవభార్యగాను జెప్పఁబడెను. దీని చేతనే నీకవులకుఁ జిత్రాంగిసంగతికూడ సరిగాఁ దెలియ దని యెంచవలసి యున్నది.

3 పద్యకావ్యమునందు:—

"క. పేరుగల ఘూర్జరాధిపు
గారాబుకొమార్తెఁ బెండ్లి♦ గావించెఁ దగన్
సారంగధరునకు న్నన
సారంగను మంజువాణి♦ యను నలివేణిన్"

అని సారంగధరునకు మంజువాణి యనుభార్య యున్నట్లు తెలుపం బడెను.

ద్విపదయందు,

"పనివాండ్రఁబిలిపించిపటములోపలను,దనరాఁగసారంగధరుచక్కఁదనము వ్రాయించి తగువిప్రవరుల కావించి..............
తగుభంగిసారంగధరునకుఁ దగిన, చిగురుఁబోఁడినిజూచి శీఘ్రంబ మీకు మగుడి వచ్చిన బహుమానంబు లిత్తు"

అని సారంగధరునికొఱకు వివాహయత్నము సలిపి, యతని నిమిత్త మాబ్రాహ్మణులు సిద్ధపఱచుకొని వచ్చిన చిత్రాంగినే రాజు హరించె నని చెప్పంబడెను. దీనిచేత నీకవులకు సారంగధరునిగూర్చియు నేమియుఁ దెలియ దని తేలుచున్నది. ఇంతియే కాక,

పద్యకావ్యమునందు,

"గీ. కుటిల చటుల మలీమస • క్రూరవర్త
నాలి దుర్గుణగణజీవ•నాలి నాలి
నతివతలపూతనాలిఁ జి•న్నాలి నతఁడు
గూపమున నూకఁ బనిచెఁ బె•న్గోపమునను."

అని చిత్రాంగి చేసినదుర్ణయము వెల్లడి యైనవెనుక రా జామెను గూపమునఁ ద్రోయించి చంపించె నని తెలుపఁబడ,

ద్విపదకావ్యము నందు,

"కనలుచుఁ బలికె నీకష్టాత్మురాలి, నిందఱుఁజూడంగ నీక్షణంబునను బంధించి కొనిపోయి పట్టణమందు, బలిమిగాఁద్రిప్పి కూపంబులోపలను బడఁద్రోసి రండు........."

అని రాజు భటుల కాజ్ఞాపింప,

"కత్తి కింతింతలు గసికండగాను,జొత్తుబాపఁగఁ జేసి చూడఘోరముగ నుప్పుపాతరలోన నుంచి యామీఁదఁ, గప్పిరి పైమన్నుగానరాకుండ"

అని భటు లామెశరీరమునఁ గత్తితో నాట్లఁబెట్టి యుప్పుపాతర లో నూరవేసినట్లును, సారంగధరుఁడు తల్లిదండ్రులం జూడవచ్చినప్పుడు; "ఘనమైనసంజీవకరణిమోపఁగనె,జను లద్భుతముగఁజూచ్చుచుండ వనిత దిగ్గనలేచి వచ్చి మ్రొక్కెనను"

అని మఱల నామెను బ్రతికించిపోయినట్లును జెప్పంబడియెను.

కాఁబట్టి ప్రధానులగు చిత్రాంగిరాజరాజనరేంద్రసారంగధరులఁ గూర్చియే యసందర్భముగాఁ జెప్పంబడిన యీగ్రంథములే యీకథ యసత్య మనుటకుఁ బ్రమాణము లగుచున్నవి.

అయినను దీనిని జాలకాలమునుండి యథార్థ మని నమ్మచున్న మనవారి కింతటితోఁ దృప్తి కలుగదు; కావున మఱికొంతదూరము విమర్శింతము. ఇందులకుఁ గథావివరము తెలిసియుండఁదగుం గావునఁ బ్రబంధము మొదటిదియైనను, చిత్రాంగివిషయమునందుఁదక్క మిగత కథాకల్పనయందు దానికిని ద్విపదకును విశేషభేద మేమియు లేకపో వుటచేతను, మనదేశమందు ద్విపదయందుఁ జెప్పంబడినప్రకారమె చిత్రాంగి భాగ్యయే యని వాడుకలో నుండుటచేతను ద్విపద ననుసరిం చియే యిచ్చటఁ గథను వివరించెదను.

రాజనరేంద్రునకు శివవరమున సారంగధరుఁ డనుకుమారుఁ డుద యించెనఁట. రా జతనికి వివాహము సేయఁదలంచి రూపపటము వ్రా యించి తగుకన్యను వెతకిరండని బ్రాహ్మణుల కాపట మొసంగి పంప, వారు చిత్రాంగిని జూచి తగుదానింగా నెంచి యామెరూపపటముం గొ నితెచ్చి రాజునకుఁ జూపిరఁట. రా జామెను మోహించి ఖడ్గ మంపి వివాహము జరిపి రప్పించుకొని తానే చేపట్టెనఁట. చిత్రాంగి య మ్మోసమెఱింగి సారంగధరుని గవయఁగోరుచుండ, రా జూరలేనియొక నాఁడు సారంగధరుఁడు పావుర మెగురవేసి యది యామెమేడపై వ్రా లినందున సుబుద్ధి యనుమంత్రికుమారుఁడు పోవలదని యెంత చెప్పినను

విసక దాసికై యతఁడామెనుందిరమున కరిగెనఁట. అంతటఁ జిత్రాంగి యతనికడఁ దనమోహమును వెల్లడించి నిరోధింపఁగా నతఁడు తప్పించు కొని బయట బడెనఁట. ఆమె యందులకుఁ గోపించి వేఁటనుండి వచ్చి నరాజుతో జరిగినది తారుమారుచేసి తెలుప రాజు కోపించి సారంగధ రుని కరపాదములను ఖండనచేయించెనఁట. అంతట మీనవనాథుఁ డను సిద్ధుఁడు వచ్చి యాతనిఁ దనయాశ్రమమునకుఁ గొనిపోయి మఱలఁ గరపాదములను గలిగించెనఁట.

దీనిననుసరించి మనము రాజరాజనరేంద్రుని స్థితియు నతని భా ర్యాపుత్రులస్థితియు విచారించినచో నిందలియథార్థము సమగ్రముగాఁ దేలును.

## —• రా జ రా జ న రే ం ద్రు ని స్థి తి •—

1. ఇతఁడు తనకుమారునికొఱకుఁ గన్యను వెతకించి సౌందర్య లోభముచేత నామెను దానే వరించెననియుఁ, గుమారునిపేర వివాహ ము జరిపించి తానే చేపట్టెననియు నిందుఁ జెప్పఁబడుటచేత నితఁడు కాముకపురుషుఁ డనియుఁ, దురాచారుఁ డనియు, నధర్మవర్తనుఁ డని యుఁ జనరకుఁ బహుప్రాయుఁడనియుఁ దేలుచున్నది.

---

ప్రబంధము ననుసరించియే ద్విపదరచియింపఁ బడినట్లు ఆగ్రంథ ము నందే పెక్కులు నిదర్శనములుకలవు. అట్లయ్యు నమ్మహానుభావుఁ డేమి విశేషమూహించియో. మూలమునందు వేశ్యగాఁ జెప్పఁ బడిన చిత్రాంగిని గులకన్యగాను రాజునకు భార్యగాను మార్చి చెప్పెను.

వేశ్యయెడ సైతము విరుద్ధముగాఁ గానుపించెడు చిత్రాంగిచర్య కులకన్యయెడనారోపించిన యాతని బుద్ధికి కావలయును దరువాతి వా రందరు నీతనిపాఠముననుసరించియే యిక్కథను నానా ముఖముల వెద జల్లిరి.

2. చిత్రాంగి తనకుమారునిపైఁ గొండెము చెప్పఁగానె విచారణము సలుపకయే కరపాదములను ఖండింప నుత్తరు వొసంగెననుటచేత మనము క్రూరు లనుచు వినుచు వచ్చిన కొందఱు తురుష్కప్రభువుల కంటెను గ్రూరాత్ముఁ డనియు, యుక్తాయుక్త వివేకము లేక ప్రజలను హింసించు దురాగ్రహగ్రస్తుఁడనియుఁ, బాపభీతియొక్కింతయు లేనివాఁడనియుఁ దేలుచున్నది.

3. రత్నాంగి కుమారునితప్పులు మన్నింపుమని పాదములపైఁ బడి వేడినప్పు డతఁడు చూపిన కాఠిన్యతచేతను, బలికిన పలుకులచేతను, నతిమూర్ఖుఁ డనియు, విశృంఖలహృదయుఁ డనియు, నిర్దయాపరుఁ డనియుఁ దేలుచున్నది.

ఈపైన వివరింపఁబడిన దుర్గుణము లీతనియెడ స్థిరపఱచుటకీతరాధారము లెవ్వియైనఁ గలవా యని విచారింప నట్టి వెయ్యేడను గానరావు. కాని వీని నిరాకరించుటకుం దగినయవి పెక్కు లగపడుచున్నవి.

ఎట్లన:—

1. ఇతఁ డాంధ్రదేశమునందుమాత్రమే కాక చోళమండలము వఱకుఁ దనయధికారమును వ్యాపింపఁజేసి నలువదియొక సంవత్సరములు ప్రజాపరిపాలనము సలిపెనని చరిత్రకారులు వ్రాయుటచేత బాహుబల సంపన్నుఁడనియుఁ, బవిత్రుఁడనియుఁ దేలుచున్నది. ఇతనిం గూర్చి నన్నయభట్టారకునిచేత భారతమునందుఁ జెప్పంబడిన యీదిగువపద్యముల చేత నీయర్థము స్థిరపడుచున్నది.

"ఉ. రాజకులైకభూషణుఁడు, రాజమనోహరుఁ, డన్యరాజతే
జోజయశాలి, శౌర్యుఁడు, విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ, డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవ పరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్.

కం. విమలాదిత్యతనూజుఁడు
విమలాచారుఁడు గుమార ♦ విద్యాధరుఁ డు
త్తమచాళుక్యుఁడు వివిధా
గమవిహితశ్రముఁడు తుహిన♦కరుఁ డురుకాంతిన్.

చ. ఘనదురితానుబంధకవి ♦ కాలజదోషతుషారసంహతిన్
దనయుదయ ప్రభావమున ♦ దవ్వుగ ద్రోపి జగజ్జనానురం
జనముగ రాజ్యసంత♦తవసంతనితాంతవిభూతి నెంతయున్
దనరుజళుక్యమన్మథుఁడు ♦ ధర్మదయార్ద్రనిబద్ధబుద్ధియై.

ఉ. ఆశ్రితపోషణంబున న ♦ నంతవిలాసమున న్మహీపి వి
ద్యాశ్రమ తత్త్వవిత్త్వమున ♦ దానగుణాభిరతి న్సమస్త వ
ర్ణాశ్రమధర్మరక్షణమహా ♦ మహిమ న్మహి నొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజనిభుఁ ♦ డత్యకలంకచరిత్రసంపదన్."

2. ఇతనికిఁ బూర్వము వేగిదేశమును బాలించిన యిరువదియా రుగురు చాళుక్యరాజులకును, నితని యనంతరము రాజ్యమేలిన పలువురు చాళుక్యులకుం గూడ నితనివలననే కీర్తిప్రతిష్ఠలు కలుగుటచేత నీతఁడు తద్వంశమునకెల్ల నాయకమణి యని తేలుచున్నది.

"క. శ్రీమందిరబుధజనచిం
తామణి! కోదండపార్థ! ♦ ధర్మవిచారో
ద్దామ ! నలనృప భగీరథ-
రామచరిత్రాభిరామ ♦ రాజనరేంద్రా !

అనియు, "ఉత్తమచాళుక్యుఁడు, విష్ణువర్ధనుండు, వంశవర్ధనుండు" అనియు భారతమునందుఁ జెప్పఁబడిన విశేషములచేత నయ్యర్థము స్థిరపడుచున్నది.

3. నన్నయభట్టు, నారాయణభట్టు మొదలగు మహాకవుల కాశ్రయుఁడై పంచమవేద మనంబరగు భారతమును దెనుఁగుచేయించుట చేత విద్వాంసుఁడనియు, విద్యాలోలుఁడనియు, భారతాది యుద్గ్రంథములను సదా వినుచు ధర్మసూక్ష్మములం గ్రహించిన వాఁడనియుఁ దేలుచున్నది. ఈదిగువ నుదాహరింపఁబడు భారతమునందలి రాజసభావర్ణనముచేతను, రాజు నన్నయభట్టారకునితోఁ బలికిన పలుకులచేతను, నయ్యర్థము స్థిరపడుటయేకాక, యతనికడ లేని సద్గుణము లేదనియు, ధర్మరాజాదులతోఁ దుల్యుఁడుగా నెన్నఁబడఁ దగినవాఁడనియు విస్పష్టముగాఁ గానంబడుచున్నది.

"వ......శబ్దశాస్త్రపారగులైన వైయ్యాకరణులును భారతరామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులును మృదుమధురరసభావ భాసుర నవార్థవచనరచనా విశారదులైన మహాకవులును, వివిధతర్కవిగాహిత సమస్తశాస్త్ర సాగరగరీయఃప్రతిభులైన తార్కికులును బరివేష్టించి కొలువ,

చ. విమలమతి న్పురాణములు ♦ వింటి ననేకము, లర్థధర్మశా
స్త్రముల తెఱంగెఱింగితి, ను ♦ దాత్తరసాన్వితకావ్యనాటక
క్రమములు పెక్కు చూచితి ♦ జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందునిల్పితి • ప్రకాశముగాహృదయంబు భక్తితోన్.

వ. అయినను నాకు ననవరతంబును శ్రీమహాభారతమునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దదియై యుండు.

మ. ఇవియేను న్సతతంబు నాయెడఁ గరం ♦ బిష్టంబులై యుండు బా
యవు భూదేవకులాభితర్పణ మహీ ♦ యఃప్రీతియుం భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదా ♦ బ్జధ్యానపూజామహో
త్సవము న్సంతతదానశీలతయు శ ♦ శ్వత్సాధుసాంగత్యమున్.

చ. హిమకరుఁ దొట్టి పూరుభర ♦ తేశకురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా ♦ మహి నొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమల ♦ సద్గుణశోభితు లైన పాండవో
త్తములచరిత్ర నాకు సత ♦ తంబు వినంగ నభీష్ట మెంతయున్. ,,

కాఁబట్టి వీనిచేత సారంగధరచరిత్రమునందుఁ జెప్పఁబడిన ప్రకార మా రాజు దుష్టాత్ముఁడు కాఁడనియు, ధర్మస్వరూపుఁ డనియు నెంచుట సముచితము కదా !

—♦ రాజరాజనరేంద్రుని భార్యాపుత్రుల స్థితి ♦—

రాజరాజునకు రత్నాంగి యనుభార్యయు సారంగధరుఁడను కుమారుఁడును గలిగియున్నట్లు సారంగధరచరిత్రమునందు కలదు. లోక ప్రతీతికూడ నట్లనే యున్నది. కాని తామ్రశిలాశాసనములయందును, చరిత్రములయందును వీనికి భిన్నముగా నతని కిమ్మంగిదేవి యనుభార్య యు, రాజేంద్రచోళుఁ డనుకుమారుఁడును గలిగి యున్నట్లు కానంబడు చున్నది.

" ఈరాజరాజనరేంద్రుఁడు తన మేనమామ యగురాజేంద్రచో ళునికూతు రైన యమ్మంగదేవిని వివాహమాడెను. కుళోత్తుంగచోళ దేవుఁడు- ఇతఁడు రాజరాజనరేంద్రుని ప్రథమపుత్రుఁడు. ఇతఁడే రాజేం ద్రచోళుఁడు."
(11 వ పుట- ఆంధ్రకవులచరిత్రము)

" ఇమ్మహారాజు (రాజరాజనరేంద్రుఁడు) తనమేనమామ య గురాజేంద్రచోళునికూతు రైన అమ్మంగదేవిని వివాహమాడి ... నలు వదియొక్కసంవత్సరములు రాజ్యపరిపాలనము చేసెను. ఇతనితమ్ముఁడు విజయాదిత్యుఁడు. కుమారుఁడు కుళోత్తుంగచోళదేవుఁడు."
(హిందూదేశకథాసంగ్రహము ఆఱవప్రకరణము. 199 వ పుట.)

ఈవిషయమునందు సారంగధరచరిత్రము విశ్వసింపఁబడఁదగిన దా ? దేశచరిత్రములు విశ్వసింపఁబడఁదగినవా ? పోనిండు. రత్నాంగికి

సారంగధరుఁడును- అమ్మంగదేవికి రాజేంద్రచోళుఁడుఁ బొడమి రనియు భావింతము. సారంగధరచరిత్రమునందుఁ జెప్పఁబడినయట్లు రత్నాంగి పట్టపుదేవి యైనచో, శాసనాదులయందు ఆమెను మాని రెండవభార్య నుదహరించుటకుఁగాని "దేవి" యనుబిరుద మీయామె కుండుటకుఁగాని కారణము లేదు. వీనిచేత నీమెయే పట్టపుదేవి యైనచో- సారంగధరచరిత్రమునందు రత్నాంగి పట్టపుదేవి యనుటకుఁ గారణము లేదు. మఱియు నమ్మంగదేవి యనువేఱుభార్య కలదని సారంగధరచరిత్రమునందు లేదు. రత్నాంగి యను వేఱుభార్య కలదని శాసనాదులయందు లేదు. కాఁబట్టి యీకారణములచేత నట్టినామములుగల యిరువురుభార్య లుండవచ్చు నని యూహించుట కేవల మసందర్భము.

అమ్మంగదేవికే రత్నాంగి యనురెండవపేరు కలిగియుండవచ్చు నని యూహింతము. అయినచో- రాజేంద్రచోళసారంగధరు లిరువురు నామెకుమారులై యుండవలెను గదా! సారంగధరచరిత్రమునం దామె కొక్కఁడే సుతుఁ డని చెప్పఁబడుటచే నది పొసఁగదు. రాజేంద్రచోళునకే సారంగధరుఁ డను పేరుకూడ కల దని యూహింతము. అట్లయినచో, నతఁడు సంసారమును విడిచి సిద్ధులలోఁ గలిసిపోయె నని సారంగధరచరిత్రమునందును- రాజ్యపరిపాలనము సేయుచు నింటనే యుండె నని దేశచరిత్రములయందును బరస్పరవిరోధముగాఁ జెప్పఁబడుటకుఁ గారణ మేమియుఁ గానిపింపదు.

కాఁబట్టి మనము సారంగధరచరిత్రమునందుకంటె దేశచరిత్రమునందు విశ్వాస ముంచుట న్యాయము. కావున, నమ్మంగదేవియు రాజేంద్రచోళుఁడును యథార్థసతీసుతు లనియు, రత్నాంగిసారంగధరులు తచ్చరిత్రకారునిచేఁ గల్పింపఁబడినవా రనియు నెంచవలసి యున్నది. ఈక్రిందిసంగతు లీయూహను స్థిరపఱచును.

1. రాజరాజనరేంద్రునితండ్రి యగువిమలాదిత్యుఁడు రాజరాజు
కూతు రైనకుందలాంబాదేవిని వివాహమాడి. తనమామగారియెడఁ
గలగౌరవమునకు సూచకముగాఁ దనకుమారునకు రాజరాజని పేరు
పెట్టెను. రాజరాజనరేంద్రుఁడు తన మేనమామ యగురాజేంద్రచోళుని
పుత్రిక యైన యమ్మంగదేవిని వివాహమాడి తనమేనమామగారియెడఁ
గలగౌరవమునకు సూచకముగాఁ దనకుమారునకు రాజేంద్రచోళుఁ డని
పేరుపెట్టెను. రాజేంద్రచోళుఁడు- రాజేంద్రచోళుఁ డను నామాంతర
ము గలవిక్రమచోళునికూతు రైనమధురాంతకదేవిని బెండ్లియాడి తన
మామగారియెడఁ గలగౌరవమునకు సూచకముగాఁ దనకుమారునకు
విక్రమచోళుఁ డని పేరుపెట్టెను. విమలాదిత్యునికాలముమొదలు- చా
ళుక్యులకును జోళులకును సంబంధబాంధవ్యములు వృద్ధికాఁగాఁ- చాళు
క్యులకంటెఁ జోళు లధికులగుటచేతఁ జాళుక్యులు తమకుఁ గన్యల నొసం
గిన మామలవట్లు గౌరవించుచు వచ్చిరి.-దీనిచేత రాజేంద్రచోళునిపుత్ర
త్వము పూర్ణముగా స్థిరపడుచున్నది. సారంగధరునిపుత్రత్వము త్రోసి
వేయఁబడవలసిన దగుచున్నది.

2. లోకమునందుఁ దమపిల్లలకుఁ బేరిడువారందఱుఁ దమతాత
తండ్రులపేరుగాని, తమవంశమునందుఁ బ్రసిద్ధిఁగాంచినవారిపేరుగాని
యిడుట వాడుకయై యున్నది. సారంగధరుఁడీపే రెం దేతరగతిలోఁ జేరి
నదియో విచారింపుఁడు. రాజనరేంద్రునిపూర్వులలో నీపేరుగలవాఁ
డెవ్వఁడును లేఁడు. ఇతరులలోఁగూడ నీనామముచేతఁ బ్రసిద్ధుఁడైన
వాఁ డెవ్వఁడును లేఁడు. ఏగ్రంథమునందును సారంగధరుఁ డనుపేరు గల
కల్పితపురుషుఁడైన లేఁడు. చాళుక్యులు శివభక్తులు కావున సారంగధ
రశబ్దము శైవార్థప్రతిపాదక మైనదగుటచే నొకవేళ విష్ణుదైవనామమే
మో యని భ్రమపడుదు రేమో ? వీరిపూర్వులకు విష్ణువర్ధనుఁడు,
విమలాదిత్యుఁడు, యుద్ధమల్లుఁడు నను నిట్టివేకాని, శివపర్యాయము

నామముగానున్నట్లు కానంబడును. కావున వీరిలో నట్టియాచారమే లేదని చెప్పవచ్చును. అయినను శివునకు సారంగధరుఁ డనునామము కల దనుటకే శంకింపవలసి యున్నది. శివసహస్రనామావళిఁ గూర్చిన మహాపురుషు కంటె శివనామముల నెఱింగినవా రుండరు కదా! ఆయన సైతము సారంగధరశబ్దముకాని, తదర్థబోధక మైనశబ్దముకాని తన్నామావళియందుఁ జేర్చియుండలేదు. అందలి చిత్రశబ్దము లం గొన్నిటిని విలోకింపుఁడు.

“1 సింహశార్దూలాయనమః 2 వ్యాఘ్రాయనమః 3 మృగాలయాపాయనమః 4 హస్తీశ్వరాయనమః 5 హరిణాయనమః 6 వాయసాయనమః 7 సంవత్సరాయనమః 8 మాసాయనమః 9 ఆషాఢాయనమః 10 సముద్రాయనమః.” ఇట్లు మృగములను పక్షులను సంవత్సరములను మాసములను గూడ శివునిగా మార్చినఁగాని లెక్క పూర్తిచేయలేకపోయిన తద్గ్రంథకర్తకు “హరిణాయ” యనునామమును వ్రాయునపుడైన “సారంగధరాయ” యని తోఁచకపోయెఁగదా? అట్టి దానిని శివపర్యాయ మనుటకంటె నసందర్భ మిం కేమున్నది! ఒకవేళ నెందే నుండిన నుండుఁగాక, యింతకంటె మనోహరము లైనట్టియు, సుబోధకము లైనట్టియు రూఢపదము లనేకము లుండ నిట్టియౌగికపదముకొఱ కేల నెమకులాడవలసివచ్చినదో!

కాఁబట్టి రాజరాజనరేంద్రునకు సారంగధరుఁ డనుకుమారుఁడు లేనేలేఁడని చెప్పవచ్చును. మఱియు రత్నాంగియుఁ జిత్రాంగియుఁ గూడ లేనివారే యని వారి నామముచేతనే గ్రహింపవచ్చును. చాళుక్యులయందును జోళులయందును మాత్రమేగాక యించుమించుగా రాజలోకమునందు- రాజలోకమునం దననేల- లోకమునం దెచ్చటను రత్నాంగి, చిత్రాంగి యనిపిలువంబడినపడంతు లెవ్వరును లేరు. కనకాంగి, లతాంగి మొదలైననామములకుంబలె దీని కర్హమైనయర్థమునులేదు.

3. అల్పాంశములుపై తము వివరించు దేశచరిత్రకారులు చరిత్రములయం దీసంగతి నించుకేనియు నుదాహరింప లేదు. అక్కాలమునందు సంస్కృతకవిత్వము మిక్కిలి వాడుకలో నున్నను సంస్కృతకవు లెవ్వరు నీకథను వ్రాయలేదు. తెలుఁగునం దైన నెప్పు డీకథ ప్రవర్తిల్లెనని చెప్పఁబడెనో యట్టి రాజరాజనరేంద్రునితరువాత నించుమించుగా నాఱువందలసంవత్సరములకు బయటఁ బడెను. అప్పుడైనను నెచ్చట నీకథ జరిగె నని వాడుకలో నున్నదో యట్టిగోదావరీమండలమున ననేకులు విద్వత్కవిశిఖామణు లుండఁగా దక్షిణదేశమున నున్న చేమకూర వెంకటకవియుఁ బశ్చిమదేశమున నున్న *కానుకూరి అప్పకవియు దీనికిఁ బ్రారంభకు లైరి.

---

* అప్పకవి కీకథతోఁ గలసంబంధ మిచ్చటఁ గొంత తెలుపవలసి యున్నది. అప్పకవి తా నొకగ్రంథమును రచియింపఁబూనియుండ విష్ణుదేవుఁ డతనికి స్వప్నమునందుఁ గానిపించి, యాంధ్రశబ్దచింతామణిం దెలుఁగు సేయు మని చెప్పి, తద్గ్రంథకర్త యగు నన్నయభట్టునకును భీమకవికిని గలిగినవివాదమునందు భీమకవి దాని గోదావరిలోఁ గలిపి వేయుటచేత నది నామావశేషం బయ్యె ననియు, రాజరాజనరేంద్రుని యవివేకముచేతఁ గాలుసేతులు నఱుకఁబడి మీననాథుఁ డనుసిద్ధునిచేత మఱల వానిం బడసి సిద్ధులలోఁ గలిసియున్న సారంగధరుఁడు మొన్న నీనడుమ మతంగగిరికడ బాలసరస్వతి యనుపండితునకుఁ గానుపించి తాఁ జిన్ననాఁడు నన్నయభట్టుకడఁ జదివినజ్ఞప్తిం బట్టి దాని నతనికి వినిపింప నతఁడు దానికిఁ దెనుఁగుటీక రచియించెననియు, నది నీకు మతంగాచలవిప్రునివలన లభించు ననియుఁ దెలిపి తిరోహితుఁ డైనట్లును, మఱు నాఁడె యొకవిప్రుఁడు దానిం దెచ్చియిచ్చినట్లును నప్పకవీయమున చెప్పఁబడెను. కాని టీకవ్రాసిన బాలసరస్వతి తన కామూలగ్రంథ మే విధముగా లభించెనో, దాని నించుకయుఁ దెలుపలేదు. అంతటిసిద్ధుఁడు

ఈయసందర్భము లన్నియుఁ జక్కఁగా విచారించినచో నీకధ యంతయుఁ గల్పిత మని తేటగాఁ గానంబడుచున్నది. అయినను గథా కల్పనయందలి విరుద్ధములనుగూడఁ గొన్నిటి నెత్తి చూపెదను.

1. రాజు చిత్రాంగిని దనకుమారున కని రప్పించి తాఁ జేపట్టె ననికదా తెలుపంబడెను ? ఆమెయంగీకారముమీఁదనా బలవంతము మీఁదనా యనువిషయ మాలోచింపవలసి యున్నది. అంగీకారము మీఁదనే యని భావింతము. నవయౌవనసంపన్నురా లయినయామె వృద్ధుఁ డైనయతని నంగీకరించునా ? వృద్ధుఁడు కాఁడందురేమో ? మనుజుఁడు సంతానము లేదని చింతించుటయుఁ, దత్ప్రాప్తికొఱకుఁ బ్రయత్నించుటయు నేవయసునందు ? సాధారణముగా ముప్పదిసంవత్సరములకుఁ బైఁగా సంతానవాంఛయు, నలుబదిసంవత్సరములవఱకుఁ గలుగ వచ్చు నను నాసయుఁ, పిదపఁ గలుగలే దనుచింతయుఁ, దరువాతఁ దత్ప్రయత్నమును స్వాభావికములు. కావున నతఁడు సంతానచింతచేతఁ గొంతకాలము శివునారాధింప నద్దేవుఁడు సారంగధరు నొసంగె నని తెలుపంబడుటచేత సంతానము కలుగునప్పటికి రాజునకు నలుబదిసంవత్సరములకుఁ బైఁగా నుండవలెను. అది యటుండనిండు. వివాహప్రయత్నము జరుగునప్పటికిఁ జిత్రాంగికి బదునాఱువత్సరములప్రాయమైన నుండ

---

దర్శన మొసఁగి గ్రంథ మొసఁగుట యథార్థమేయైనచో నతఁడేల తెలుపక పోయెనో తోచకున్నది. రావుబహదూరు కందుకూరి వీరేశలింగంపంతులవారు కవులచరిత్రమునం దీవిషయము విపులముగాఁ జర్చించి-యాంధ్రశబ్దచింతామణిని బాలసరస్వతియే రచించి గ్రంథప్రాశస్త్యముకొఱకు నన్నయపేరు పెట్టెననియు, సారంగధరుఁ డతనికిచ్చె నన్నమాట యసత్యమనియు సిద్ధాంతపఱచిరి. కాని యేలనో సారంగధరుఁడే యసత్యమని వ్రాయకపోయిరి. బహుశః యది నాచేత వ్రాయించుట కని తలంచెద.

వలెను గదా ? పదునాలుగువత్సరములకన్యకు వివాహము సేయనెంచిన సారంగధరున కిరువదిసంవత్సరములైన నుండవలెను గదా ? రాజునకు నలుబదిసంవత్సరములు దాటినవెనుకఁ బుట్టినకుమారున కిరువదిసంవత్సరములప్రాయము వచ్చునప్పటికి రాజు వృద్ధుఁడా ? పడుచువాఁడా ? అట్టివాని నామె యంగీకరించునా? అంగీకరించినచోఁ

"పటములో వ్రాసినబాలుండు కాఁడు, యెటువంటి దీసుద్ది .........
అటువంటివానికిల్లాలుగానైతిఁ, బటుగతిఁదలవ్రాఁతఫలమిట్టులుండె"

అని యేల చింతించును ? కాబట్టి బలత్కారముమీఁదనే యని భావింతము. అట్లయినచో నతఁ డంతకాల మామెను దనవశమున నుంచుకొని కాఁపురము చేయించుకొనఁగలుగుట కవకాశము కలదా ? ఆమె యిట్టిస్థితిలో నుంటి నని తనతండ్రికెఱుకసేయక మానునా ? క్షత్రియకులసంజాతుఁడైనయతఁ డయ్యవమానమున కోర్చి యూరకుండునా ? కాఁబట్టి యిది కేవలము యుక్తివిరుద్ధము.

2. సారంగధరుఁడు పావుర మెగురవేయుటయు, నది చిత్రాంగిచేతఁ బట్టుపడుటయు, నందులకై యతఁ డచ్చటి కరుగంబూనుటయు బుద్ధి వారించుటయు నెంతసందర్భశుద్ధిగా నున్నవో చూతము.

యుక్తవయస్సు వచ్చినట్టియు, నుచితానుచితజ్ఞుఁడైనట్టియు, యువరాజపదమునం దున్నట్టియు, సారంగధరుండు పావురముల నెగురవేసి వీధులవెంటఁ బరువులిడె నఁట ! ఈవిషయమునం దీకవియభిప్రాయమేమో కాని, అట్టివానిలో నిట్టియజ్ఞుఁ డుండఁబోఁ డని నానమ్మకము.

అతనిపావురము చిత్రాంగిచేత నెట్లుపట్టుపడెనో చూతము.

"... ... ... ... పాడైనఁ యామీఁదిపావురంబునకుఁ
జిలుకనూరకిచూపిచిత్రాంగిదేవి. పిలిచినఁ జిలుకను బెంటిగానెంచి
మేలైనచిత్రాంగిమేడపై వ్రాలె, వ్రాలినఁ గైకొనివనితలుఁదాను"

ఆమె యొక్క యాఁడుచిలుకను జూపఁగా నది తన పెంటియగా నెంచి యతని పావురము మచ్చట వ్రాలె నఁట! ఆకృతియందును రూపమునందును కొంచెమైన భేదము కానిపింపని కాకులును కొంగలును సైతము వేలకొలఁది మందలో నున్న తమజతపిట్టను గడుదూరమునుండియైన గుర్తింపఁగలవు. భగవంతుఁడు పుట్టువులోనె దాంపత్య మేఱుపఱచుటచేతఁ బక్షుల కట్టిజ్ఞానము స్వాభావికముగా నుండును. అందును బావురము లధిక జ్ఞానము కలవి. అట్టిపావురము చిలుకను జూచి తన పెంటి యని భావించి యచట వ్రాలె ననుటకంటె విరుద్ధ మిం కేమున్నది ?

ఇఁక సుబుద్ధి వారించినవిధము చూడుఁడు.

"రాణివాసమునకు రాజు లేనపుడు- పో నీకుఁ జెల్లదు బుద్ధి నూహింపు
గణుతింపరానిచక్కనిది చిత్రాంగి- జనులలోపల శౌర్యశాలివి నీవు
అదరిపాటున నొంటి నరిగితి వేని-ముదితనీపైఁ బడు మోహంబుచేత"

సుబుద్ధికి జరుగనున్నది ముందుగానె యెట్లు తోఁచెనో ! ఒకవేళ నతఁడు త్రికాలవేదియేమో ? అయినచో నిట్లు జరుగునుగావున మీరు వేఁటకుఁ బోవల దని చెప్పి రాజును వారించినచోఁ జాల బాగుండెడిది. లేదా, సారంగధరుని పావుర మెగురవేయునప్పుడే వారించినను నింతకంటె బాగుండెడిది. కవి తనకు ప్రౌఢిమ చాలనందున నిది ప్రౌఢమార్గ మనుకొని ముం దేమిచెప్పఁదలంచెనో దాని నిచ్చటనే స్పష్టముగా వెల్లడించెను ! ఈకథ కల్పిత మగుట కిదియొక్కటె చాలును.

3. చిత్రాంగి సారంగధరునికడఁ దనయభిప్రాయ మేతీరున వెల్లడించెనో కనుఁగొందము.

"రానేమి పోనేమి రాజుతోనేమి ?- నేనె యెంతటికైన నీకేమిభయము
మచ్చికనినుఁగూడిమనసురంజిల్ల- ముచ్చటాడఁగవలెమోహంబువిూర
జనపతి యును నీవుసమమింకనాకు- ననుమాన మేల రమ్మనిచెట్టబట్టె

హాహహా యని వేళ్లు మూటిగా బట్టి- మేడకోపలఁ దీఁగె మెఱు
పుచందమునఁ

చిత్రజాకేళిచౌశీతిబంధముల- చిత్తరువులఁ జూపి చిఱునవ్వు నవ్వి
చనుబంతులదరంగసారంగధరుని- బెనఁగుచునిట్లనిప్రియముతోఁబలికె
దీపింపఁగా బహుదినములనుండి- నీపైని నాప్రేమ నిలిచియుండెడిని
నాఁడఁబోయినతీర్థ మరుదెంచినట్లు- నేఁడు మోహము దీఱ నినుఁ
జూడఁగంటిఁ

దప్పదు విరహవేదనకు నే తాళ. నిప్పటిపనిఁ దీర్పుమీదిగొజవ్వాజి
వాపు లెంతు వచేల వలపున్నచోట- వావుల నెంచఁగ వలవదీపట్ల
గురుభామనంటఁడాకోరిచంద్రుండు- వరుససుగ్రీవుండువదినెఁగ్గె కొనఁడె
చలము సేయకుమని చక్కనిమేడ- తలుపులుమూయంగ......
బాగాయె నీకఁజాలు పది వేలువచ్చె-సాగిపోనిమ్మని సారంగధరుఁడు
బిట్టాడఁగాఁజూచి నెలఁదిచిత్రాంగి- గట్టిగామొలదట్టికరములఁబట్టి
పెనచిపోనీయక పెనఁగులాడఁగను " అనిచెప్పఁబడెను.

పద్యకావ్యము నందింతకంటెను పచ్చిబూతులుకలవు. ఇది యెం
తస్వభావ విరుద్ధముగా నున్నదో చూచితిరా ? ఎంత వలపుగలిగినను
దనహృదయమును వెల్లడించు స్త్రీ సాధారణముగానుండఁ బోదు. అం
దును జేష్టలచేతనే కాని వాక్కులచేత వెల్లడించు స్త్రీ బొత్తుగా నుం
డదు. స్త్రీలయందిట్టి గుట్టు స్వాభావికముగా నుండుటచేతనే సహజ
ముగాఁ బురుషులు వారికి వశులై యుండుట తటస్థించుచున్నది. ఇంత
యేల, నూతనపురుషునితో మాటలాడునప్పుడు వేశ్యసైతము లజ్జ
నుజ్జగింపఁ జాలదు. అట్టిచోఁ గులకన్యయగు చిత్రాంగి యింత సాహ
సముగా మాటలాడఁ గలిగెననుట కీ కవి యెట్లు సాహసింపఁ గలిగెనో
నే నూహింపఁ జాలకున్నాఁడను.

ఆమెయిల్లు చౌశీతిబంధముల చిత్తరువులతో నలంకరింపఁ బడి

యుండెనఁట. వ్యభిచారమే జీవనముగాఁ గల వేశ్యలయింటఁగూడ నిం తపాడుగా నుండవుకదా ! రాజాంతఃపురమిట్లుండెనని యీకవితప్ప మఱి యెవ్వరేని గనియేని వినియేని నుండరేని జిత్రాంగియునట్లు చేసియుండు నని నిశ్చయింపుఁడు. ఈవిధముగా నీగ్రంథ మాదినుండి యంతమువఱకు స్వభావవిరుద్ధములగు కల్పనలతో నిండియుండి యథార్థముకానని తానె చాటుకొనుచున్నది. ఇట్టిదాని నింకను విమర్శించుట కాలమును వ్యర్థ పుచ్చుటగాఁ దలంచి యింతటితో విడచితిని.

ఓచదువరులారా ! యిందుఁ గొంచెమేని యథార్థము లేకపోవు నా యని మీమనసునందు శంకబొడమెనేని, భోజచరిత్రమును స్మర ణకుఁ దెచ్చుకొనుఁడు. వేఱువేఱు దేశములయందు వేఱువేఱు కాలము లయందు వెలసిన భోజరాజు, కాళిదాసుఁడు, భవభూపతి మొదలగు వారందఱు నొకచోట నొకకాలమున నున్నట్లు కల్పించిన తద్గ్రంథకర్త వాక్యములు నమ్మి పండితులు సైతము మొన్నమొన్నటి వఱకు మోస పోయి యుండలేదా ?- ఇప్పుడుసైతము సామాన్యులు కొందఱామోస మునందే కప్పబడి యుండిలేదా ? అట్లు బొడితలకును బొటనవ్రేలికిని ముడి బెట్టుట పూర్వాచారమే కాని మన సారంగధరచరిత్రకారుఁడొ క్కఁడు మాత్రమే సలిపినదికాదు.

అట్లయినచో రాజమహేంద్రవర సమీపమున నున్న కాతేరుమె ట్టను సారంగధరుని మెట్టయనుటకును- మండల న్యాయాధిపతి నివాస ము సలుపు గోదావరీతీర సౌధమును జిత్రాంగిమేడ యనుటకును గారణమేమని మఱియొక శంకవొడమెనేని నీదిగువవాని నాలోచింపుఁడు భీముని పట్టణము పూర్వ మేకచక్రపురమనియు, భీముఁడు బకాసురుని కంపి, యందలి ప్రజలను గాపాడుటచేత దాని కా నామము కలిగె నని యు, విజయనగర సమీపమున యున్న రణస్థలమను గ్రామము కడ భీమబకాసురులయుద్ధము జరిగెం గావున నాచోటున కాపేరు కలిగెననియు

జెప్పుదురు. ఏకచక్రపురము పాంచాలదేశమునకు సమీపమున నున్న ట్లును, బాంచాలము కురుదేశమునకు సమీపమున నున్నట్లును గానం బడుచుండఁగా నిట్లనుటకుఁ గారణ మేమి?

లోకమునం దిట్టి వెన్నియో కలవు. ఇట్టి మూఢసాంఘల కర్థము గాని, కారణముగాని విచారింపఁ బూనుట కాలము వ్యర్థపుచ్చుటయే కాక యేమిలాభము? కాఁబట్టి యిట్టి విపరీతశంకలం బడక దీని మర్మ మంతయు వెంకటకవి బాలసరస్వతి యప్పకవి యను నీముప్వు రిలో నుండఁబోలునని మనసున నుంచుకొని యధార్థమును గనిపెట్టుట కొఱకు యత్నింతురు గాక.

మాటవరుస కొకసారి తచ్చరిత్రాంశము లన్నియు సత్యము లని కూడ ననిచూతము. అయినను నట్టివానిని గ్రంథరూపమున వెలయింపఁ గూడదు. నాటకరూపమున బొత్తుగాఁ గూడదు. అయోగ్యులకు నీతిని బోధించుటకై యోగ్యుల చరిత్రములను వ్రాయుట యావశ్యకము గాని యెచ్చటఁ జూచిన ప్రత్యక్షమగు నయోగ్యులం గూర్చి వ్రాయుట యా వశ్యకము కాదు. వ్రాయఁ బూనినచో నెంద అయోగ్యులచరిత్రములను వ్రాయఁ గలము?

దశరూపకాదిలక్షణగ్రంధములలో:—మూలకథయందుఁ బ్రి ధానులం గూర్చి యెందేని ధర్మవిరుద్ధముగఁ జెప్పఁబడినచో రూపక మునం దావిషయమును ధర్మ నిబద్ధముగా నుండునట్లు మార్చుట కాని, యాభాగమును విడచుట కాని సలుపవలె నని విధియింపఁబడి యుండ నిట్టికథరూపకముగా వ్రాయఁబడుట కెట్ల న్యాయమైన దగును?

మహాకవివిరచితములైన నాటకము లెన్నియో కలవు గదా! వానిలో నొకదానియం దైనఁ బరకీయ (జారిణి) నాయికగాఁ జేయం బడినదా? కాళిదాసుఁడు తన విక్రమోర్వశీయమునకు వేశ్యను నాయి కం జేసి పవిత్రురాలినిగా వర్ణించెను. ఆమె దేవ వేశ్య కావున నట్లు చేసెనందు రేమో? శూద్రకుఁడు తన మృచ్ఛకటికమునకు వసంతసేన

యనువేశ్యను నాయికగా నొనర్చి కులకాంతలంద ఱామెం జూచి నేర్చు కొనఁ దగినయోగ్యత లెన్నియో కలిగినదానినిగా వర్ణించెను.

కాఁబట్టి వీనిచేత నీతిబాహ్యలైన స్త్రీలను నాయికలుగా నుంచి నాటకములను వ్రాయుట బొత్తుగాఁ గూడదని స్పష్టముగాఁ గానంబడు చుండ నిప్పటి మనవారు సారంగధరము, తారాశశాంకము మొదలగు నీతిబాహ్యములైన నాటకములను రచించి- ఖండాంతరపండితులునైత ము గొనియాడునట్లు గ్రంథములను రచించి- మన పూర్వకవులు మన దేశమున నాటిపోయిన కీర్తిలతను మూలచ్ఛేదము చేయుటకు యత్నిం చుచుండిరి. ఇట్టి నాటకములం బ్రదర్శించునప్పుడు వేశ్యలును వ్యభిచారి ణులును దక్క కులకాంతలు దత్ప్రసంగమును వినఁగలరా ? తన్నటన ముం గనఁగలరా ? మగవారిలోనైతముఁ దగువారు విలోకింప నొల్లరు.

అట్టి సందర్భమే నే నీనాటకమును రచించుటకుఁ గారణ మైనది. దీనికి సారంగధరనాటక మని పేరిడినచోఁ దగువారు ముట్టకపోదు రను భయముచేతనే ముట్టుటకైన నర్హత కలుగుటకుఁ జిత్రాభ్యుదయ మని గూఢముగా నామకరణముఁ జేసితిని.

మత్సరహృదయు లిం దేవంకనైన దోషముం గ్రహించి యానం దింపఁ గలరు. నిర్మత్సరులగు పండితులు గ్రహింపఁ దగినగుణ మిం దెయ్యెడనైన వెలయించి నన్ను ధన్యుం జేయఁ బరమేశ్వరుం బ్రార్థిం చుచు దీనిని విరమించెద.

K. NarayanaRao,
*Author.*

గీ. ఎట్టిగుణవంతుఁ డేనియు ♦ నెల్లవారి
కిష్ట మగుమాడ్కి క్షితిఁ జరియింపలేఁడు;
ఎట్టిపండితుఁ డేనియు ♦ నెల్లవారి
కిష్ట మగుమాడ్కి కృతి రచియింప లేఁడు.

---



శ్రీ

మేధాదక్షిణామూర్తిపరబ్రహ్మణేనమః

# చిత్రాభ్యుదయము.

## ప్రథమాంకము.

### ప్రదేశము—రాజమందిరము.

[రాజు, యువరాజు, సుబుద్ధి, హరిశర్మ, ఆస్థానసభులం గూర్చునియుందురు. విశారదుండు ఛాయాపటములను జూపుచుండును.]

రాజు—సందియ మేమి?

గీ॥ గానమును, జిత్రరచనయుం, ♦ గవితయు నను
మూండు వోలెను జగమున ♦ సమ్మోహపఱపం
గలుగునవి లేదు; కాననే ♦ గలుగు నవ్వి
పుణ్యమున నందు, రభ్యాస ♦ మునను గాక.

అందును జిత్రవిద్య కడుం జిత్రమైనది: ఏమా? భగవన్నిర్మిత రూపములకుం బ్రతిరూపములు గలిగియుండును. మఱియు సర్వజనులకు సంతోషము గలిగించునది కావున ప్రథమగణ్యం బనందగు. ఈచిత్రవిద్యవలననే కదా:—

గీ॥ పూని పలునాళ్లు తిరిగినం ♦ గానరాని
రాచకన్నెల నొకముహూ ♦ ర్తంబులోన
నింట నుండియె కనుంగొంటి ♦ మింతకంటె
వింత వేఱొండు కలదె? యీ ♦ విశ్వమందు.

హరి—మహారాజా! అంతకంతకు నాగరికత హెచ్చుచుండుటచేత;

గీ॥ చదువులను నేర్చి, పత్రికృతిశా • స్త్రముల నెఱిఁగి,
యన్యదేశాటనము సల్పి, • యతికుశాగ్ర
బుద్ధులై కొంద ఱిప్పుడు • పూర్వ మెందు
విని యెఱుఁగనియవియుఁ గ • ల్పింతు రధిప!

రాజు—సరి కాని. ఇట్టి సంతోషసమయమునఁ బెద్దమంత్రిగారు లేనందుకు చాల విచారముగా నున్నది. అయినను దీర్ఘయాత్రల కరిగిన గుణదేవుఁడు గా రిట్టిచిత్రములను దిలకింపకపోరు; కాని, యాయనతోఁ గలసి యనుభవించు వేడుకమాత్రము మనకు లేక పోయినది.

సుబు—మహారాజా! మాతండ్రిగారియెడఁ దమరు చూపిన దయకు మేము ధన్యులము.

హరి—(తనలో) ఔరా! అదృష్ట మన్న వీరిదే యదృష్టము. ఏమా? ఈమహారాజాదినుండియు వీరియెడ నిట్టి యాదరమునే చూపు చున్నాఁడు. ఇంత యేల? యీమధ్య గుణదేవుఁడు తీర్థయాత్ర కేగ, నా యుద్యోగ మాతని కొమరుం డగు నీకసుగాయకే కట్టి పెట్టెను గాని తరువాతమంత్రి నగు నామాటఁ వలపెట్టనైన లేదు. ఈతని పక్షపాతబుద్ధి కింతకంటె వేఱునిదర్శనముకావలెనా? కావుననే తండ్రికొడుకు లిరువురు రాజు తమవాఁడు కదా యని నాపై అంకెలు వేయుచుందురు, కానిమ్ము, ఆవృద్ధజంబుక మరు -డించులోపల రాజును వశపఱచుకొనకుందునా?

యువ—తండ్రీ! చిత్రవిద్యను గూర్చి తమరు సెలవిచ్చినది యథా ర్థమే. అయినను- యివి సృష్టివైచిత్ర్యము లయినచో నష్టము లేదు. కాని- కేవల యువతీరూపము లగుటచే నివి ప్రదర్శిం

చుటవలన లోకమునకుఁ గొంత యుపకారము కలుగునని నాయభి ప్రాయము. ఏమందురా ?

గీ॥ కన్నుదోయిని వసియించి • కామదేవుఁ
డంబుజాస్యల దర్శన • మైనయపుడు
బుద్ధిని గలంప నెంతటి • పురుషుఁ డైనఁ
బాపపు వికార చేష్టల • పాలు గాఁడె ?

సుబు — మేలు. యువరాజా ! మేలు ! లోకోత్తరమైన నీతివర్తనముచే నీవు లోకమున కుపాధ్యాయుఁడ వగుచున్నావు.

రాజు — కుమారా ! నీవు చెప్పునది నిజమే. సర్వజనులును సమానముగ నాదరించునది సౌందర్యవతి యగు కన్యయే గనుక యాతఁడు దానిని మాత్రమే యిందుఁ జూపుచున్నాఁడు.

విశా — మహారాజా ! (పటమును జూపుచు) యీమెం దిలకింపుఁడు. ఈమె మహేంద్రనగరాధీశ్వరుని కన్య. సమస్తవిద్యలయందును యీమె సరస్వతి యనఁబడును. విద్యలోఁ దన్ను గెలిచినవానిఁ గాని వివాహ మాడకున్నందున నెందఱో రాజకుమారులు యీ సుందరాంగికై నోడి చనిరి.

రాజు — సర్వ శుభలక్షణలక్షిత మైన యీమె ముఖసౌందర్యము విద్యలకు నిలయమైనట్లు వెల్లడి యగుచునే యున్నది.

విశా — (వేఱొకటి చూపుచు) రాజశేఖరా ! యీజగదేకసుందరిని జూడుఁడు.

ఉ॥ ఈనవమోహనాంగి సొగ • సెంతని వర్ణన సేయవచ్చు నీ
మానిని రూపచిత్రములు • మానవనాథవరు ల్స్వకీయ శ
య్యానిలయంబులందు వెల • యన్ఘటియింతురు రూపగర్వమున్
బూని నిజాంగన ల్మెలఁగఁ • బోవ పటంబుఁ దలంచి సిగ్గులన్

అందఱు—(ఆశ్చర్యముతోఁ జూతురు)

యువ—(తనలో) ఓహో! యేమి యీయద్భుతము! లావణ్యాసముద్రి ముహ్వాంగలేదు కద! ఈసర్వాంగసుందరిని సృష్టించుటచే బ్రహ్మ తనప్రజ్ఞను బూర్తిగాఁ బ్రకటించుకొనెను. (ఆలోచించి) కాదు- కాదు- నేనే పొరఁబడితిని. ఈజగన్మోహినిని జతుర్ముఖుఁడు సృష్టించి యుండఁడు.

చ॥ ఘనమతి నూర్వసీప్రముఖ ♦ కాంతలఁ జేసి యజుండు కీర్తినిం
గనుటలు చూచి చూచి, యల ♦ కాయజుఁ డెల్లవిధంబుల న్మనం
బునఁ దలపోసి పోసి, జగ ♦ ముల్ భళిరే యనఁ జేసి యుండు నీ
మెను; దమప్రజ్ఞచే నొరుల మించఁ దలంతురు కాదె? నేర్పరుల్.

రాజు—మేలు! విశారదా! మేలు! చూడఁ దగిన చిత్రమును జూపి కన్నులపండువు గావించితివి.

చ॥ అనుపమ దివ్యరూప విభ ♦ వాన్విత యై తనరారు నీ నెలం
తను సృజియించుట న్నలువ ♦ ధన్యుఁడు; తత్ప్రతిరూపము న్ప్రద
ర్శన మొనరింపఁ గల్గుట వి ♦ శారద! ధన్యుఁడ వీవు; నిట్టిదా
నిని గనుఁగొంట ధన్యులము ♦ నిక్కము మేమును నెల్లభంగులన్.

తెరలో—జయము, జయము, మహారాజా! దాక్షిణాత్యులపై దాడి వెడలిన విజయసేన సేనానాయకులవారికడనుండి వచ్చిన సువేగుఁడు ద్వారముకడ వేచి యున్నాఁడు.

రాజు—ఏమీ? సేనాధిపతికడనుండియా! శీఘ్రముగా రమ్మనుము. విశారదా! నీప్రదర్శనము క్షణకాలము నిలుపుము.

సువే—(ప్రవేశించి) జయము, జయము, మహారాజా! సేనాధిపతిగారీలేఖను దమకు సమర్పింపు మనిరి. (లేఖ నిచ్చును)

రాజు—చదువుఁడు. (అని సుబుద్ధి కిచ్చును.)

సుబు— స్వస్తి శ్రీమన్మహామహీమండల మండనాయమాన రాజమహేంద్రపురవరాధీశ్వర చాళుక్య వంశవర్ధన విష్ణువర్ధనమహారాజ రాజపరమేశ్వరాదిబిరుదాంచిత రాజరాజనరేంద్ర ధరాతలేంద్రులవారి సన్నిధికి:—

సేనాధిపతి విజయసేనుఁడు కళ్యాణపురసమరతలమునుండి నమస్కారపూర్వకముగా వ్రాసికొను విజ్ఞాపనము.

ఏను దేవరవారిచే ననుజ్ఞాతుండనై సకలయోధనికరముతోఁ బురము విడచినది మొదలు నేఁటిదాఁక భగవదనుగ్రహమువలనఁ జెక్కుచెమర్పకుండ నింతదనుక నేలినవారి కీర్తికల్లిం బ్రాఁకించితిని. ఇచ్చటఁ ద్రిభువనమల్లునకును మాకును బ్రవర్తిల్లిన దారుణసంగ్రామంబునఁ గాలవశమున నొక యూఁచకోల కాలనాట నిప్పుడు కొంచెమస్వస్థుఁడనై యున్నాఁడను. కావున సేనానియోగమునందు దక్షులైనవారి నేరినైన శీఘ్రముగఁ బంపఁగోరెద.

| | |
|---|---|
| కళ్యాణపురము<br>శకము ౯౭౫ చైత్ర శు ౫ | ఇట్లు విన్నవించు సేనాధిపతి,<br>విజయసేనుఁడు. |

రాజు—ఏమీ ! మా విజయసేనుఁడుకూడ గాయపడుపఁబడెనుగా ?

ఓరీ ! దాక్షిణాత్యహతకా !

గీ॥ ఘనతరాభీలనమదదిగ్దంతి కర్ణ
కుహరపాటననిస్సాణ ♦ ఘోరభీష
ణారవంబున గుండియ ♦ లవియఁ జేసి
కట్టి కొనితెచ్చెదను నిన్నుఁ ♦ గాచికొమ్ము.

అమాత్యులారా ! కదనతలంబున కరుగఁదలంచితిని; కావున సత్వరము సన్నాహముఁ గావింపుఁడు.

సుబు—ఈస్వల్పకార్యమునకుఁ దమరే యరుగవలెనా ?

రాజు—ఏమి? ఇది స్వల్పకార్యమా?

సుబు—కాదా మఱి? శత్రుకాననముల క్షణములో దహింపఁజేయు విక్రమోపేతు లని విఖ్యాతిని గన్న మీకు- అల్పులగు యాదవ నిడవనాంకురములను సంహరించుట స్వల్పకార్యము కాదా? ఇంత కును- పూవులబంతివలె నీపృథివి నంతయు మీచేతులఁ బెట్టఁ జాలు సేవకు లెందఱో యుండ- మీరే యరుగవలెనా?

రాజు—అట్లయిన సమరమున కనుపఁ దగినవారిని సత్వరమె నిర్ణయిం చి క్షణములమీఁద నచట వ్రాలం సన్నాహము గావింపుఁడు.

హరి—(తనలో) ఇపుడు మంచిసమయము సమకూరినది. సుబుద్ధిని సమరమున కనిపినచో శాత్రవులచేతిలోఁ జచ్చినను జచ్చును. బ్రతికి వచ్చినను వచ్చులోపల రాజును వశపఱచుకొనవచ్చును. (పైకి) మహారాజా! మన సుబుద్ధిగారికంటె సమర్థులు మఱియొ కరు గలరా? ఈసమయమునం దీయనకంటెఁ జనఁదగినవారు లేరు.

రాజు—(ఆలోచించును.)

సుబు—మహారాజా! యూరకుంటి రేమి?

గీ॥ తమకు మానమె సొమ్మ్ముగాఁ • దలఁచువారు
బ్రాహ్మ్యమును క్షాత్రమును గల్గి • బ్రబలువారు
నారయ నియోగిభూసురు • లనెడువారు
వారి పని కంప శంకింప • వలెనె భూప?

రాజు—నేను శంకించుచున్నమాట సత్యమే; కాని- మీ సామర్థ్యము కొఱకు కాదు- మఱి యెందుకొఱకా? "నే నూర లేనపుడు నాకుమారు ని ట్లనుపఁ దగునా?" యని మీనాయనగారును; "చిఱుతవయస్సువానిని సమరమున కె ట్లనిపె!" నని లోకులును గూడఁ గటకటపడుదు రేమో యని.

హరి—విచారింపఁ దగినది సామర్థ్యము కాని వయసు కాదు. ఈయన సామర్థ్య మెఱుఁగనివా రెవ్వరు కలరు?

సుబు—తమకు సమర్పింపఁబడిన దేహము తమకొఱకు వినియోగపడినప్పుడు తండ్రిగారు గాని- తదన్యులు గాని వేఱువిధముగా భావించుటకు వీలు లేదు. కావున,

ఉ॥ ఆనతి యిచ్చి పంపుము నృ ♦ పాగ్రణి! యూరక సందియంబులం
బూనక; కుంతలేశ్వరుచ ♦ మూతతితోడ క్షణంబులోపలన్
సేనలు లేకయే, రణము ♦ సేయకయే గొనితెచ్చెద; న్భవ
న్మానస మద్భుతార్ణవనిమ ♦ గ్నము గాఁగ, జగంబు మెచ్చఁగన్.

రాజు—మంచిది. లోకాపవాదమునకు నేను లొంగిపోకుండ సమర్థత గలవారి నేరినైన సహాయమునకుఁ గొనిపొండు.

యువ—తండ్రీ! వేరినో యన నేల?

గీ॥ నను సుబుద్ధిని జంటఁగా ♦ ననుపు మయ్య!
గాలియును, గీలియును బోలెఁ ♦ గల్సి వైరి
వనము, లావుసి యెరవుగా ♦ ననుపు పఱచి;
తమ యశోవల్లి నాటి వ ♦ త్తుము నృపాల!

హరి—(తనలో) ఈతఁడుం గూడఁ జనినచో నింక నా కేయడ్డము నుండదు. (పైకి) మహారాజా! యువరాజగారి పలుకులు చాల యుక్తముగా నున్నవి.

రాజు—అవును. నాకును అట్లనే తోఁచినది. (యువరాజుతో) వెంటనే ప్రయాణమై పోయి, విజయసేనునితోడను, విజయలక్ష్మితోడను శీఘ్రముగా వెడలి రండు. మహామాత్యతనూభవా! తండ్రిగారుకూడ నూర లేరు; కావున నెంతత్వరలో వచ్చిన నంత సంతసించెదను.

సుబు—చిత్తము. (నిష్క్రమించును.)

యువ—(నిఁబడించుచు) నా కిప్పుడు సమరమునకుఁ బోవుట సంభవిం చినందులకు సంతసముగానె యున్నది; కాని కడపటఁ జూచిన కన్యాతిలక ముద్భవించుటచేత నేవంశము ధన్య మైనదో- యామె యునికిచేత నేపురము పావన మైనదో- యీరెండువిషయములు యెఱుఁగకమునుపే యిచ్చటనుండి యేగవలసివచ్చినందుకుమాత్ర ము యించుక విచారముగా నున్నది. ఓహో! యేమి యా సౌందర్యశోభ!

గీ॥ ఆకనులనేత్ర చిత్రావ ♦ లోకనంబు
చేతనే యింత హర్షముఁ ♦ జెందెడెంద
మామెనే చూచు భాగ్యంబు ♦ నబ్బెనేని
యింక నెంత హర్షంబు వ ♦ హింపఁ గలదొ?

రాజు—సువేగా! నీవు పోవచ్చును.

సువే—చిత్తము (పోవును)

రాజు—విశారదా! నీవు కడపటఁ జూపిన కన్యాతిలకము- యేయదృ ష్టవంతుని తపఃఫలమో యెఱిఁగింప మఱచితివి.

విశా—ఆమె కళింగేశ్వరుని యనుంగుఁగొమరిత.

రాజు—ఏమి! కళింగేశ్వరుని యదృష్టము! క్షీరసముద్రుని దిరస్క రించినాఁడే! ఆమె నామ మేమో యెఱుఁగుదువా?

విశా—చిత్రాంగి యందురు.

రాజు—సెబాసు! నిజముగాఁ జిత్రాంగియే!

గీ॥ శశి పయోజాతములు, భృంగ ♦ చంపకములు,
జలద చంద్రికలుఁ, గురంగ ♦ సర్పములును,
వారణ మృగేంద్రములు, నైజ ♦ వైర మెడలి
యమరె నీచాన యెడలఁ జి ♦ త్రాంగి కాదె?

హరి—(తనలో) కడపటఁ జూపిన చిత్రమునందలి కన్నియ- యీ

యన కన్నులకుఁ గడు నింపుగాఁ గనుపించినట్లు దోఁచుచున్నది. ఈసమయమునం దీయనకు వెఱ్ఱి యెత్తించితినో_ క్షణములో స్వాధీన పఱచుకొన వచ్చును. పరులను వశపఱచుకొనవలె నన్న-వారిని దుర్వ్యసనములోనికి దింపుటయే. అందును స్త్రీవ్యసనము యొక్క చిత్రమేమో కాని, మిగిలిన వ్యసనముల నన్నిటిని మిం చినది. వయసు మీఱినవారు వలపునం దగిలిరేని యిఁకఁ జెప్ప వలసిన దేమి? ముదిసినవాని కామమును ముని కోపమును ముం దు వెనుక తెలియఁగవు. కాఁబట్టి యీయనకుఁ గామవికారము కలి గింప వలెను. (పైకి) ఇప్పుడు మీరు అత్యంతలావణ్యవతిగా నెన్నిన యీమె చిత్రమేది? పరధ్యానముగా నుండుటచే బాగు గాఁ జూడలేదు. మీరుకూడ మెచ్చఁదగినంత సుందరాంగి చిత్ర ముఁ జూపఁబడినదా ?

రాజు—అయ్యో ! మీరు సరిగాఁ జూడ లేదా ? ఒక్క నాచేతనే గాదు. లోక మందఱిచేతను గొనియాడఁబడఁదగిన రూపవంతు రాలు. ఏది విశారదా! యీచిత్రాంగి ప్రతిచ్ఛాయ?

విశా—(చూపును.)

హరి—ఓహోహో ! యీమె యీలోకముచేతనే గాదు. ముల్లో కములచేతను గూడఁ గొనియాడఁబడఁ దగినది. మహారాజా ! యీమె కిట్టి నిరుపమానసౌందర్య మెట్లు సిద్ధించియుండును?

రాజు—పూర్వపుణ్యవిశేషమున.

హరి—ఈమె పూర్వపుణ్యవిశేషమునఁ గాదు. ఏధన్యాత్ముఁ డీమె కడ కంటిచూపులకు నోఁచినో నెనో యాతని పూర్వపుణ్యవిశేషము వలన.

రాజు—అదియును యథార్థమే. విశారదా ! ప్రొద్దు పోయినది. నేఁటికి నీప్రదర్శనము నిలుపుము.

విశా—చిత్తము. (పోవును)

హరి—ఇట్టి సర్వాంగసుందరిని మీ రేల చేపట్టఁగూడదు ?

రాజు—ఇంతకన్న వివేకహీన మింకేమైనఁ గలదా ?

హరి—అట్లనెద రేల ?

రాజు—నాయంతకొడుకు నట్టింట మసలుచుండఁగా- వానికి వివాహము సేయుట మాని- వయసుముదిరిన నేను తగుదు నమ్మా యని రెండవపెండ్లికి దారసిల్లవలసిన దేనా ?

హరి—మహారాజా ! అటుపిమ్మట అబ్బాయిగారికి మాత్రము వివాహ మొనరింపఁ గూడదా ?

రాజు—ఇప్పు డంత యవసర మేమి వచ్చినది? అఱువదిసంవత్సరములు హాయిగాఁ గడపి, సమస్తసుఖముల ననుభవించి, సాటివారిలో శహబా సనిపించుకొన్న నేను- మొదటిభార్య మొట్టో యని మొత్తుకొనుచుండఁ దగుదు నని రెండవభార్యకొఱకు తారు లాడుట నాపని కాదు.

హరి—మీ రేమియుఁ దారులాడ నక్కఱ లేదు. పదిదినములలోఁ గన్యను దీసికొనివచ్చి మీ పాదములచెంతఁ బడవేయనా ?

రాజు—వివాహమునకు వ్యతిరేకము లగు విపరీతలక్షణము లన్నియు నాయందె వ్యక్తమగుచుండఁగాఁ గన్య నిచ్చుట కాకళింగేశ్వరున కంత కండ్లు మూసుకొనిపోయె ననుకొంటిరా యేమి ?

హరి—కళింగేశ్వరునకు మీకంటె గొప్పయల్లుఁడు లభించునా ?

రాజు—వరవిచారణకైశ్వర్యమే ప్రధానము కాదు.

గీ॥ భాగ్యమున కీడుగాఁ గుల ♦ ప్రాభవంబు
దాని కీడుగ విద్యయు ♦ దాని కీడు
గా వయోరూపములు నున్నఁ ♦ గాక తమకు
మారికల నీయ నొల్లరు ♦ మహితమతులు.

హరి — అట్లనే కానిండు. అందు మీయందు సమగ్రముగా లేని దెద్ది?

రాజు — కన్య ముఖ్యముగా నెద్ది కోరునో యట్టి యౌవనమే.

హరి — ఇప్పుడు మీవయస్సు జవరాండ్రచేఁ దిరస్కరింపఁబడునంత యధికముగా లేదు. అయినను, సందియము మీ కేల? సెలవిండు. సంబంధమును నిముషములో సమకూర్చుకొని వత్తును.

రాజు — ఇంత సులభముగా మీరు దీని నెంచుట నాకు వింతగా నున్నది.

హరి — గుణదేవునిపైఁ గల యాదరముచే నాప్రజ్ఞ నెన్నఁడు మీరు పరీక్షింప లేదు.

రాజు — (తనలో) ఇదియా వీని రాకడ! కానిమ్ము- చూతము (ప్రకాశముగా) ఆర్యా! మీరును గుణదేవుఁడు గారును మాకు సమానులే. అట్లు కాదని మీ రెన్నఁడును నాలోచింపకుఁడు. అదిగాక- యిప్పుడు మీ తేర్పఱచుకొన్న పద్ధతి నా కంత యంగీకారముగా లేదు. ఏమందురా? తనంతవాఁడు కొడు కుండఁగాఁ దాను వివాహమునకు సిద్ధపడిన వివేకహీనుఁడని లోకులచే ననిపించుకొనవలసిన లొచ్చుపని యేల చేయవలెను? అది యటులుండ, మీ రేగి యడిగినచో "ముదిమి హెచ్చినకొలఁదియు నీతఁడు మూర్ఖుఁ డగుచున్నాఁ" డని యాకళింగేశ్వరుఁడుమాత్రము నన్ననఁడా?

హరి — అయ్యో! అందఱిచేతను మిమ్ముల నవమానింపఁ జేయునంతటి యవివేకి గాఁడు యీ హరిశర్మ.

రాజు — (తనలో) వీని కెంతవిపరీతపుబుద్ధి పుట్టుచున్నది! (ఆలోచించి) కానిమ్ము- కళింగేశ్వరుఁడే తగినశిక్షఁ గావించును.

హరి — మహారాజా! ఆలోచించెద రేమి?

కం॥ సెల వొసఁగి చూడుఁ డాయలి
కులవేణిన్ క్షణములోనఁ ♦ గూరుతు; మఱి యం
దలకుం జాలనియెడ నా
తలఁ దరిగింపంగవచ్చు ♦ దయ మాలి నృపా !

రాజు—(తనలో) ఈయనపలుకు లతిచిత్రముగా నున్నవి. తా నీ పని చేయలేకపోయిన తలగూడఁ దరిగించుకొనునఁట ! పెండ్లిమాటల కరిగిన, నచట పరిభవ మందక వచ్చినచో నదియే పదివేలు. కానిమ్ము, తాఁ ద్రవ్వుకొనిన గోతిలో నప్పుడు తానే దిగును. కాని, కూడ దన్నను యీతఁ డిప్పుడు వినుట లేదు. (పైకి) మంత్రివర్యా ! మీయిష్టము.

హరి—కృతార్థుఁడను. చాల ప్రొద్దు పోయినది, దయచేసి శెల వింపుఁడు.

రాజు—మంచిది. (పోవును)

హరి—(ముందుకు నడచి తనలో) మహారాజునకు మదనావేశము గలిగించితిని. జయప్రదముగాఁ గార్యము చేసికొని రానియెడల శిరచ్ఛేదముఁ జేయించుకొనుటకుఁగూడ సిద్ధపడితిని. ఆగుణదేవు నవమానపఱుపవలె నని కదా నాయాశ? ఆతనిమాట యటుండ నిమ్ము. నాతల నాకుఁ దక్కినఁ జాలును. ఏవిధముగా నాలోచించినను యీసముద్రము దఱిలేనిదిగాఁ దోఁచుచున్నది. ఏమా ?

గీ॥ ఆయువతి యందకత్తెల ♦ నందకత్తె
వయసుఁ జాలఁగఁ గడపిన ♦ వాఁ డితండు
ఎల్లు కూటమి పొసఁగెడు ♦ నిర్వురకును
ముదిమి వలచిన నెవని నే ♦ ముదిత వలచు.

ఏటిబురదలోఁ దిగఁబడిన యీఁబోఁతువలెఁ గుడిచి కూరుచుం డలేక యీకార్యపంకమునందుఁ జిక్కువడిన నేను బయటఁ బడుట

యెట్లో పరమేశ్వరునకే యెఱుక. (ఆలోచించి) కానిమ్ము యిప్పు డేమనుకొనిన నేమిలాభము?

౪౦. ఔనో కాదో యని భయ
మానసుఁడై మొదలుపెట్ట ♦ మానిన నెపుడున్
కానేకా దేపనియును
గాన ధృతిన్ గార్యములకుఁ ♦ గడఁగఁగ వలయున్.

(నిష్క్రమించును)

ఇది ప్రథమాంకము.





శ్రీ

మేధాదక్షిణామూర్తి పరబ్రహ్మణేనమః

# చిత్రాభ్యుదయము.

## ద్వితీయాంకము.

ప్రదేశము — రాజవీథి.

**వామనుఁడు** — (ప్రవేశించి ఆశ్చర్యముతో) ఓహో! పట్టణ మెంత మనోహరముగా నలంకరింపఁబడినది! పెండ్లికుమార్తెతోఁ గళింగ నుండి బయలువెడలినది మొన్ననే కదా! అప్పుడే యీసంతోషవార్త పట్టణ మంతయుఁ బ్రాఁకినది కాఁబోలు!- కాని, దారి యందు మాకుఁ దటస్థించిన చిక్కు, వీరివీనులయం దింకను బ్రవేశించి యుండదు. (కొంచెము సేపాఁగి) ఔరా! పౌరులు పంతము లాడికొనినట్లు ఒకరికంటె నొక రెక్కుడుగాఁ దమతమ వీథులను శృంగారించుటం జేసి, యెచ్చటఁ జూచినఁ గాచపాత్రముల వ్రేలాడుకాయమానములే; యంత్రపుత్రికల నమర్చిన దంతపు గంబములే; యెచ్చోట విలోకించినఁ బన్నీటిగొట్టములం దాపిన తోరణస్తంభములే- ఇఁక మహారాజుగారు కోటలోఁ జేయించిన యలంకారములకు మేరయే లేదు. ఈమహోత్సవమును జూచు వేడుకతో దూరస్థలములనుండి సైతము వచ్చిన ప్రజలచే నప్పుడే తోఁటలును దొడ్లునుగూడ నిండిపోయినవి. (సంతోషముతో)

ఇఁక వివాహదినములలో నెంతసందడిగా నుండునో! పెండ్లికంటె సంతోషకార్యము లేదు కదా?

సీ॥ బహువిధభూషణాం ♦ బరసమలంకృత
గాత్రులౌ బంధువ ♦ ర్గములచేత
గాయక పాఠక ♦ కవి పరిహాసక
ప్రముఖవిద్యావినో ♦ దములచేత
వేణు మృదంగ ని ♦ స్సాణ వీణాముఖ్య
ఘనతర మంగళ ♦ ధ్వనులచేత
భక్ష్య భోజ్యాన్నపా ♦ నీయ లేహ్యాది
సుమనోజ్ఞతర భోజ ♦ నములచేత
భవ్య పరిమళ ద్రవ్యసం ♦ పదలచేత
నవ్యతోరణ కాయమా ♦ నములచేత
నొప్పునట్టి వివాహ మ ♦ హోత్సవంబు
కరణి నేయుత్సవము ప్రీతిఁ ♦ గలుగఁ జేయు.

అయినను; యజమానులకుమాత్ర మంతగా సుఖ ముండదు. ఏమన?

సీ॥ పుంతలో నలిగి పోఁ ♦ జూచుచుట్టంబుల
మాటిమాటికి బ్రతి ♦ మాలలేక
పూఁటపూఁటకుఁ బంక్తి ♦ భోజనంబుల కతి
లౌక్యులఁ దిరిగి పి ♦ ల్వంగలేక
పాడి తోలంగి పైఁ ♦ బడుధూర్తవైదిక
బృందంబులను దని ♦ యింపలేక
నగలుఁ గట్నములుఁ గా ♦ నక్కలిఁ నిచ్చుకొనువేళ
లం గల్గుకగవు లో ♦ పంగలేక

తలపఁ నేవారికిని రాక ♦ తప్పనట్టి
నాకబలినిష్ఠురములు వి ♦ నంగలేక
కార్యభారము తమపైని ♦ గలుగువారు
పడెడుశ్రమ మింత యనుచుఁ జె ♦ ప్పంగ వశమె ?

(కొంచము నే పాఁగి) సంగతు లన్నియు సరిగా మనవిచేయుటకుఁ ద్వరితముగా రమ్మని మహారాజుగారు వర్తమాన మంపుటచే ఆయాసము తీర్చుకొనుట కొక యఱక్షణమైనను వెన్నువాల్చుకొనుటకు వీలు లేక వెంటనే పోవలసివచ్చినది. ఉస్. అబ్బ !

గీ॥ ఒడలు దాపక పని సేయఁ ♦ గడఁగునేని
సుఖము దక్కదు; కాసింత ♦ సుఖముఁ గోరి
యేమఱిన మాట దక్కదు; ♦ రామ ! రామ !
సేవకావృత్తికంటెను ♦ జేటు కలదె ?

ఇంకఁ గోటలోని కరిగి హరిశర్మగారికిఁ దటస్థించిన యాపత్తును గుఱించి మహారాజుగారితో మనవి చేసి, శీఘ్రముగాఁ బోయి రవంత శ్రమ తీర్చుకొనెదను. (నిష్క్రమించును)

(అంతటఁ దెర యెత్తఁగా నాస్థానమున రాజు కూర్చుండియుండును.)

రాజు—(తనలో) ఔరా! హరిశర్మసామర్థ్యము చాల ఆశ్చర్యముగా నున్నదే! కళింగేశ్వరు నొప్పించుటయేగాక కన్యనుగూడ వెంటఁ బెట్టుకొని వచ్చెనఁట ! కాని, యీదినము కూడనిదిన మగుటచేఁ బురప్రవేశమున కవకాశము లేనందున యూరివెలుపలి యుద్యానవనమునందలి చతుశ్శాలాభవనమున విడియింపఁ జేసితిని. ఆహరిశర్మ యనినదానికంటె నతిశయముగానె చేసికొనివచ్చెను. కాని దారియం దేదో యాయనకు విపత్తు తటస్థించె నని చెప్పుచున్నారు. ఆవిపత్తెట్టిదో యడిగి తెలిసికొనవలె నని కళింగ కరిగి

వచ్చిన వామనునికొఱకు వర్తమాన మంపితిని. ఆతఁ డింతయాలస్య మొనర్చుటకు హేతు వేమి చెప్పుమా?

వామ—(ప్రవేశించి) జయము, జయము, మహారాజా!

రాజు—వామనుఁడా! వచ్చితివా? దారిలో మీ కేమో చిక్కులు తటస్థించిన వని వింటిమి- నిజమా?

వామ—మహారాజా! మేము పడినయవస్థ యే మని మనవి చేయుదును?

రాజు—సంగతి యేమో సవిస్తరముగాఁ జెప్పుము.

వామ—హరిశర్మగారితో మేము యాకళింగ కరిగిననాఁడె కళింగేశ్వరునితో మాటాడుట కవకాశము కలుగుటచే, మన మంత్రి గారు మాటాడి సంబంధము సానుకూలపఱచిరి.

రాజు—ఆకళింగేశ్వరుఁడు తనతనయ నిచ్చుట కంగీకరించెనా?

వామ—ఏల యంగీకరించకుండును? కుమార్తెకు వరుఁడు దొరకక కొట్టుకొనుచున్న కళింగేశ్వరుఁడు తగినసంబంధము దొరకినపుడు తల యొగ్గకుండునా? తల యొగ్గుటయే కాదు; ఆలస్య మైనచో సంబంధ మావలకు దాఁటిపోవు నని యానుఱునాఁడె ఖడ్గవివాహము గూడఁ గావించెను.

రాజు—(ఆశ్చర్యకోపములతో) ఏమి! ఖడ్గవివాహమా? అట్లు జరుపు మని యాహరిశర్మ కెవ రాన తిచ్చిరి? తా నంతయాత్రుత నొందవలసినయవసర మేమి వచ్చినది? ఈచాళుక్యవంశమునం దెన్నఁడైన నేరికైన ఖడ్గవివాహము జరుగుట తా నెఱుఁగునా?

వామ—ఆసంగతి యాహరిశర్మగారే మనవిచేసికొనవలెను.

రాజు—మంచిది. తరువాత?

వామ—తరువాత నమ్మహారా జిచ్చిన ధన కనక వస్తు వాహన

దాస దాసీజనముతోఁ బెండ్లికొమారితను దోడ్కొనివచ్చుచు మొన్నటియుదయమున రత్నగిరికడ విడిసితిమి.

రాజు—తరువాత ?

వామ—అచ్చట మజ్జనభోజనాదు లొనర్చి, మార్గాయాసము తీఱుటకు సాయంకాలమువఱకు నిలిచి, మఱలఁ బయన మగుచుండఁగా జయపురాధీశ్వరుఁ డగు విజయభూపతి మమ్ము ముట్టడింపఁ దన సైన్యము నంపుచున్నట్లు స్కంధావారమునం దొకవదంతి కలిగినది.

రాజు—(ఆశ్చర్యముతో) విజయభూపతియా ? అతనికి మిమ్ము ముట్టడింప నవసర మేమి ?

వామ—ఈరాజసుతను దన కిమ్మని విజయభూపతి పెక్కుసారులు వర్తమాన మంపఁగా- యీమె యిష్టపడనందున- కళింగేశ్వరుఁ డీమె నిచ్చుట కంగీకరించ లేదఁట ! అది మొదలాతఁడు పగఁగొని యుండి, యిదియ యదన నని యూహించి, పట్టితెమ్మని లెక్కకు మించిన వీరభటులను బంపెను.

రాజు—ఔరా! ఏమి వీనిసాహసము! (ఆలోచించి) సరే. తరువాత?

వామ—హరిశర్మగా రావదంతిని విని, ఒక చెలిమికత్తెను నన్నును ఆరాజకుమార్తెకుఁ దోడుగాఁ జేసి దాపుననున్న యొకకొండ చఱియలో దాచిరి. అనంతర మామెయాందోళికయందు, ఉచిత వేషముతో నొకపరిచారికం గూర్చుండఁబెట్టి, అది రక్షింపఁబడుచున్న ట్లభినయించిరి.

రాజు—మంచిది. పిమ్మట ?

వామ—అంతలో సేనలు వచ్చి ముట్టడించినవి. అప్పుడు మనవారికిని వారికిని గొంత పోరు నడచినది. మనవారు మితముగా నుండుట చేతను. వారినైనఁ దగువిధముగా నడుపువారు లేకపోవుటచేతను

గొందఱు మడిసిరి; కొందఱు పాఱిపోయిరి; మిగతవారు పట్టు వడిరి.

రాజు—అన్నా! యెంతపని జరిగినది! హరిశర్మగారేమయిరి?

వామ—పాఱిపోవుటకుఁగూడఁ బాలుపోకగాఁబోలు ముందుగానె పట్టుబడిరి! అట్లు పట్టువడినవారి నందఱిని పాశబద్ధులం జేసి- పరిచారిక యున్నపల్లకితోఁగూడఁ- బట్టణమునకుఁ గొంపోయిరి.

రాజు—ఔరా! ఏమి విపరీతము! తరువాత?

వామ—పలువిధముల విలపించెడు రాజకుమార్తెను బలుమాటలూఱడించుచు, నమీపగ్రామమున వాహకులం గుదిర్చి, శత్రువులపహరింపఁగా మిగిలిన సామగ్రితో నెడనెడఁ దడవు మసలక వడివడి వచ్చితిమి.

రాజు—(కోపముతో) విజయభూపతి యంతవిచ్చలవిడిగా సంచరించుచుండె నేమి? ఓరీ! కొండయెలుక! విజయభూపతీ!

ఆ॥ కొండవాండ్రు నిన్నుఁ • గొలుచుచుండఁగ మాలఁ
గూరుచుండలేక • కూళ వగుచు
బాట నేగువారిఁ • బట్టి బాధించు నీ
కావరం బడంతుఁ • గాచికొమ్ము.

వామనా! మంచిది. నీ వరుగుము.

వామ—చిత్తము. (పోవును)

రాజు—(తనలో) ఈవ్యవహార మిటు లుండ- హరిశర్మ యాతని నెట్లొప్పించెనో తెలియకున్నది. ఆకళింగేశ్వరుఁడో- అప్పుడప్పుడు నన్నవలోకించుచుండుటచే నావయోరూపముల బాగుగా నెఱిఁగినవాఁడే! తనకుమార్తెను నాకిచ్చుటకెట్లంగీకరించెనో తెలియకున్నది! అంగీకరించుటయే కాదు- అప్పుడే ఖడ్గవివాహముకూడ జరిగినదఁట! ఔరా! ఇంతవఱకేమచ్చయు నెఱుఁ

గని యీరాజరాజనరేంద్రుఁడు, యిప్పటికి- యీవయస్సున లో
కులపెద్దవులకు లోంగవలసినయోగము తటస్థించినది కాఁబోలు !
సంబంధ మొనఁగూర్చుకొనివత్తు నని తా నన- వయసు గడచిన
వానికిఁ గన్య నిచ్చుటకు వా రేల యంగీకరింతు రని నే నూ
హించి- అచ్చటికిఁ బోయి యడిగి, యాకళింగేశ్వరునిచే నామాట
యనిపించుకొనినఁ గాని యాతిక్క తిరుగ దని యెంచి- అటులే
కాని మ్మని హరిశర్మతో నంటిని. అదియే నాయనుమతిగా నెంచి
కొని, చూడఁ బోయి కాల్చి వచ్చినట్లు గావించుకొని వచ్చెను.
ఇప్పుడు నేచేయవలసిన దేమి? యీమెను వివాహ మాడుటయా?
వల దని నిరాకరించుటయా ? వివాహమునకు నాయంతరాత్మ
యించుకంతయు నంగీకరించుట లేదు. నిరాకరించినయెడల
నామెజీవితమున కెంతయపయశము కలుగును. ఇంతకును వయసు
గడచినన్ను వరించుట కామె యెట్లంగీకరించెనో? (కొంచెముసే
పాలోచించి) నడచినవృత్తాంత మంతయు నామూలాగ్రముగఁ
దెలిసికొందు నన్న నాతఁ డచ్చట చిక్కవడెను. (ఆఁగి) కానిమ్ము,
యీలోపున కళింగరాజసుతవలన నైనను సంగతి గ్రహింపకుందు
నా ? ముందుగా విజయభూపతిగర్వ మడంచి హరిశర్మాదులను
విడిపించుటకై వెంటనే ప్రయత్నించవలయును.

ఇది ద్వితీయాంకము.





శ్రీ

మేధాదక్షిణామూర్తి పరబ్రహ్మణేనమః

# చిత్రాభ్యుదయము.

## తృతీయాంకము.

### ప్రదేశము— ఉద్యానవనము.

[ చిత్రాంగియు లలితాంగియుఁ బ్రవేశింతురు ]

లలి—భర్తృదారికా ! నీవు పలికినది నిజమే; కాని యిట్టిసమయములందు విచారముగా నుండరాదు.

చిత్రాం—సఖీ ! తలిదండ్రులను విడచివచ్చినందులకు నేను విచారించుట లేదు. ఆఁడుపుట్టువుఁ బుట్టినప్రతివారును అత్తవారింటి కరుగుట యెప్పటికయినను దప్పదని నే నెఱుఁగనా ? మఱి యేమందువా ? నానిమిత్తము శత్రువులచేఁ జంపఁబడినట్టియుఁ, బట్టువడి కొంపోఁబడినట్టియుఁ బ్రియజనము మాటిమాటికి జ్ఞప్తికి వచ్చుటచే మనస్సునందు విచారముగా నున్నది.

లలి—దైవయత్నమునకు మన మేమి చేయఁగలము. అయినను, నీ తండ్రిగారును, మామగారునుగూడ విజయభూపతిని నాస్మైకశేషుని గావింపకపోరు; కావున మన మాసంగతిని మఱచిపోవలెను.

చిత్రాం—మన మిల్లువిడచినవేళ మంచిది కాదు. దానికితోడుగాఁ గూడనిదినమునఁగూడ నిచటఁ బ్రవేశించితిమి. ఇందువలన ముందేమి రానున్నదో తెలియదు.

లలి—ముద్దరాలా ! ముం దేమి వచ్చునో యని యిప్పుడే బెంగఁగొ నియెదవా ? ఈసందియము తీఱుటకే కాదా నీమామగారు నేఁ డును రేఫును మనల నిం దే యుండుమనిరి ?

చిత్రాం—రేపుకూడ నిం దే యుండవలెనా ?

లలి—(చిఱునవ్వుతో) ఇన్ని యేం డ్లోర్చినదానవు యిఁక రెండుదిన ము లోర్చుకొనలేవా ?

చిత్రాం—నీవు పరిహాసములకు సమయాసమయము లెఱుఁగవు సుమా !

లలి—(వినుట నభినయించి తనలో) యెవ్వరో వచ్చుచున్నట్లు చప్పు డగుచున్నది. (చెట్లసందులనుండి చూచి) పోలికలనుబట్టి భర్తృదారకుఁ డని తోఁచుచున్నది. (నిదానించి) సందియ మేమి? ఆయనయే. ఎంతయదృష్టము ! (పైకి) సఖీ ! యెవ్వరో వచ్చుచు న్నారు చూడుము.

చిత్రాం—(చూచి) అయ్యో ! తెలివిమాలినదానా ! ఎవ్వరో యనెద వేమే ?

లలి—పోనిమ్ము-నీహృదయేశ్వరుఁడే యనెదఁ గోపింపకుము.(తనలో) ఓహో ! భగవంతుఁడు నాకోరిక నెంతలో ఫలింపఁ జేసెను!

చిత్రాం—చెలీ! ఆయన రాకముందే మనము పోవుదము నడువుము.

లలి—ఎంతచమత్కార మమ్మా ! ఇట్లుపలుకఁగానే నీకుఁ గలయభి లాష యెంతయు వెల్లడి కా దని నీయభిప్రాయము కాఁబోలు !

చిత్రాం—ఇందు చమత్కార మే మున్నదే ?

లలి—మఱి పోవుద మనెద వేల ?

చిత్రాం—నే నిప్పు డాయనకంటఁ బడఁదగినవేషముతో నుంటినా ?

లలి—అట్లయిన నీవు పొమ్ము- నే నేపొదలోనో దాఁగియుండి చిరకా లమునుండి చూడఁగోరిన యీమహాభాగుని చూచియేవచ్చెదను.

చిత్రాం—(చిఱునగవుతో) నేనుమాత్రము నిన్ను విడచి పోఁగల నా? నీ వెచ్చటనుందువో నేను నచ్చటనే యుందును.

లలి—నేను మొదటనే చెప్పితిని కాదా? (అని నవ్వును)

చిత్రాం—అదిగో! పాదరక్షలచప్పుడు వినవచ్చుచున్నది. ఆయన సమీపమునకు వచ్చినట్లున్నారు. ఆలసించక దాఁగియుండుటకుఁ దగినతావు చూడుము.

లలి—అవు నవును, మన మీపూవుటీరమున దాఁగుదము రమ్ము.

ఇద్దఱు—(దాఁగుదురు)

యువ—(ప్రవేశించి) ఔరా! ఆకుసుమాయుధుచరిత్ర మెంతయ ద్భుతమైనది!

గీ॥ అతనుఁ డాతఁడు, కీరవా ♦ హనము, చెఱకు
విల్లు, తేఁటులగొనయము, ♦ విరులతూపు,
లాకుబాకులు, పక్షిసై ♦ న్యం, బదెట్లొ
సకలజగములు సాధింపఁ ♦ జాలు నొకఁడె.

(వేదనతో) అతని వాడిములుకుల వేడిమి నా కప్పు డనుభ వసిద్ధమే; ఏమా?

ఉ॥ అన్నము ముట్టరాదు, క్షణ♦మైనను గూరుకు రాదు, చంద్రుపై
వెన్నెలపైఁ జిరాకు, కడు ♦ విన్నది యైనఁ బరాకు, ధైర్యమా
సున్న, వివేకమా కరము ♦ శూన్యము, వీనికిఁ గారణంబు లా
క్రొన్ననవింటివానివిరి ♦ కోలలెకా? తలపోసి చూడఁగన్.

లలి—(జనాంతికముగా) సఖీ! పటమునం దీమహాభాగుని బరికించి నపుడు, అందు రచియించినవాని కరకౌశలముకూడఁ గల దేమో యని సంశయించితిని; కాని యిప్పుడు ప్రత్యక్షముగాఁ జూచుటచేత- నాసంశయము నశించి- ప్రియసఖి కనురూపుఁ డగు భర్త లభించె నని గర్వపడుచున్నాను.

చిత్రాం—నెట్టి నానా ! వధూవరులకుఁ బరస్పరానురాగ మదృష్టా యత్తము గదా !

యువ—ఎల్లప్పుడు నెవ్వరో యొకరు వచ్చి- యెందులకో యొకందు లకుఁ బలుకరించుచుండుటచేత, విసువుపుట్టి యొంటిగా నుండవచ్చు నని కదా యిచ్చటికి వచ్చితిని; కాఁబట్టి, యీ చంద్రకాంతశిలా వేదికపై నించుకఁ గూర్చుండెదను. (కూర్చుండి-ఆలోచించి) ఈ మనోరథము మెన్నటికైన ఫలించునో లేదో మనసుకు గోచరిం పకున్నది. (ఆలోచించి) ఔరా ! ఆలోచించి చూడఁగా సౌఖ్య ము అదృష్టాయత్తము గాని భాగ్యాయత్తము కా దని పొడకట్టు చున్నది.

చ॥ కలవు సమస్తసంపదలు, • కల్గును రెండవలో ప్రాణమేని యీఁ
గలిగినవారు నాకొఱకుఁ • గాని స్మరవ్యథచే మనంబులో
పలఁ గృశియించుచుంటి నొక • పద్మదళాక్షిని గూర్చి; కావునన్
గలుములు గల్గిన న్సుఖము • గల్గుట దుర్లభ మంచు నెంచెదన్.

చిత్రాం—సఖీ ! యీయనస్థితిఁ జూడఁగా నెక్కుడు సందియము కలుగుచున్నది. బహుపరివారసమన్వితు లయ్యు నిట్లొంటరిగా వచ్చుటకు హేతు వేమో తెలియదు. మఱియుఁ బటమునందు స్ఫుటముగా నగపడుప్రతియవయవము నిప్పు డింతకృశించుట కేమి హేతువో తోఁచదు, అదిగాక, విరహలక్షణము లనేకము లీయనయెడఁ బొడకట్టుచున్నవి. ఒకవేళ చిత్ర మన్యాయత్త మ గుటచే నీదృశావస్థఁ బొందలేదు కదా !

లలి—(జనాంతికముగా) నీమనోహరునకు నీయెడఁ గలయనురాగము నాకుఁ దెలియవలె నని కాఁబోలు నీయుపన్యాసము ?

చిత్రాం—(జనాంతికముగా) పరహృదయమును జక్కఁగాఁ గనిపెట్టఁ గలదానవు !

యువ—అయినను నావలకు నాకే వింతగా నున్నది.

గీ॥ ఊరుఁ బేరును దెలియని ♦ యువిద నోర్తుఁ
బటములోపలఁ గని మేలు ♦ పడితి; నీటఁ
బ్రతిఫలించిన చంద్రబిం ♦ బంబుఁ జేతఁ
బట్టి ముద్దాడఁ జూచెడు ♦ బాలునట్లు.

చిత్రాం—(జనాంతికముగా) చెలీ! యెగతాళి మాని యొక్కట చెప్పుము. ఈయన యొంటరిగా వచ్చుటకు హేతు వేమై యుండును?

లలి—(జనాంతికముగా) ఒంటరిగా నెట్లు వచ్చెను? మనసునందు నీవు లేవా?

చిత్రాం—(జనాంతికముగా) ఎంతచెప్పినను నీయసందర్భప్రలాపము లు మానవు.

లలి—(జనాంతికముగా) ఇం దసందర్భ మే మున్నది? నీ విచ్చటికి వచ్చుట విని- ని న్జూడఁ గోరి- పరిజనముతో వచ్చిన లజ్జచే నీవు కనఁబడుటకు శంకింతు వనుకారణమున నొంటరిగా వచ్చెను.

చిత్రాం—(కోపముతో, జనాంతికముగా) ఊఁహూ! ఆలాగుననా! నీపాండిత్య మంతయు నాకడఁ జక్కఁగా వినియోగపడుచున్నావులే!

నైశ్వా—నామిత్రుం డిం దున్నాఁడని కేశవుఁడు చెప్పెను గదా! నన్నుసైతము పిలువకుండఁగా నొంటిగా వచ్చుట కేమి హేతువో? ఈనడుమ నీతనిస్థితి యంతయు మారుతీరుననే యున్నది.

చిత్రాం—(జనాంతికముగా) చెలీ! యెవ్వరో కాని యావకుళవృక్షము దాపున నున్న కాలిబాటనుండి యిటు వచ్చుచున్నారు.

లలి—(జనాంతికముగా) వేషమునుబట్టి శుద్ధశ్రోత్రియవటువువలె నగుపడుచున్నాఁడు.

యువ—అకటా! నామిత్రులు నావలపువిన్న నవ్వుదురుకదా! ఏమనా?

గీ॥ ఊరుఁ బేరు నెఱుంగని • యువిద నోర్తు
వలచి యే మని వారితోఁ • దెలుపఁ బోదుఁ
దెలిపినను వార లేమిటి • సలుపఁ గలరు
నావివేకశూన్యతకు నై • నగుటకంటె.

వైశ్వా—అమగో! మిత్రుఁడు స్తంభింపఁబడినట్లు-చిత్రింపఁబడినట్లు-యోగముపట్టినట్లు- తాపినట్లు— నిశ్చలముగాఁ గూరుచుండి, క్రొత్తగాఁ గావ్యము పారంభించుకవివలె నేకాగ్రచిత్తుఁడై యేమో ఆలోచించుచుండెను. ఒకవేళ మన్మథావస్థ కాదు గదా! (నిదానించి) సందియ మేల? మదనజ్వరమే సోఁకినది. అన్నన్నా! వేసవికాలపుగంధపుమోఁకవలెఁ గృశించుటయే గాక, ఎంతగా మాఱిపోయెను! కావున వెంటనే ప్రతీకారము సలుపకున్న నపాయము సంభవించును. (సమీపించి) వయస్యా! నీకు శుభమగుఁ గాక!

యువ—(చూచి) ఓహో! వైశ్వానరుఁడా? చెలికాఁడా! రమ్ము! కూర్చుండుము! నే నిచ్చట నుంటి నని నీ కెవ్వరు చెప్పిరి?

వైశ్వా—మకరంద ముండుతావు తుమ్మెద కెవ్వరు చెప్పుదురు?

యువ—నిజముగా నీ వటువంటి సూక్ష్మబుద్ధి కలవాఁడ వే.

వైశ్వా—ఏమిలాభము; నాబుద్ధి నీకడ వినియోగపడకున్నది.

యువ—అట్లనెద వేమి?

వైశ్వా—ఈనడుమ నీవు బొత్తిగా మాఱుపుఁ జెందఁ- నందులకుఁ గారణ మిది యని తెలిసికొనఁ గలిగితినా?

యువ—(తనలో) ఈతఁడు నాస్థితి గొంతవఱకు గ్రహించినాఁడు. (పైకి) నీ కటులనుమాన మెందుచేతనో కలిగినది.

వైశ్వా—అనుమానమే కాదు; ప్రత్యక్షమే- చూడు !

ఉ॥ మేను కృశించె, భోగముల♦ మీఁద నుపేక్ష జనించెఁ, గన్నులెం
తేనియు నెఱ్ఱవాఱెఁ దనః♦ వెప్పుడుఁ బుల్కలు మీఱె, నెద్దియో
ధ్యాన మెద న్ఘటిల్లె,హితు ♦ లందును సందియ మావహిల్లె,మున్
లేనివి మార్పు లిక్కరణి ♦ లెక్కకు మించెను గాదె నీయెడన్.

యువ—(తనలో) కొంతవఱకే కాదు- అంతయుఁ గనిపెట్టినాఁడు.
బడబానలము నైన దాపవచ్చును; కాని మదనానలము దాప శ
క్యము కాదు కదా!

వైశ్వా—చెలికాఁడా ! స్నేహ మనఁగా నెట్టిదో నీకడ మేము నేర్చ
కొనినవారము. అట్టి నీవె యిట్లు భేదబుద్ధితో నున్న- నిఁకఁ జెప్ప
వలసిన దేమున్నది.

చిత్రాం—(తనలో) ఆర్యపుత్రుఁడు తనమనోభిప్రాయ మిప్పుడు
బయటఁ బెట్టక తప్పదు.

యువ—మిత్రుఁడా ! నామనోరథము నీకడ దాచితి ననుమాట నిజ
ము; కాని, నీయందలి భేదబుద్ధితోఁ గాదు. మఱి యే మందువా?
మనుష్యప్రయత్నమునకు మార్గము లేని దగుటచేత. అయినను
నాయం దీనింద యేల ? తెలిపెద వినుము. నేను గుంతలమున
కేగెడునాఁ డొకయంత్రకారుఁడు వచ్చి, యనేకరాజకన్యలపటము
లను యంత్రములమూలమునఁ బ్రదర్శించెను. అం దొకసుందరీ
మణిపటము విలోకించినతోడనే నాహృదయ మామెలావణ్యాం
బుధియందు మగ్నమై పోయెను.

చిత్రాం—(జనాంతికముగా) ప్రపంచమున నీకుఁ గలసంబంధ మం
తయు నింతటితో ముగిసినది.

లలి—(జనాంతికముగా) సఖి ! యింతలోఁ దొందరపడెద వేమి? శేష
ముకూడ వినుము.

వైశ్యా—మిత్రుఁడా ! తరువాతసంగతిఁ జెప్పుము.

యువ—ఇఁకఁ జెప్పుట కేమున్నది ? ఎప్పు డామనోహరాకారము విలోకించితినో యాక్షణము మొదలు-

చ॥ నిలచినఁ, గూరుచున్న, శయ ♦ నించిన, మేల్కొనియున్న, నన్యులన్ గలసి చరించుచుండిన, నొ ♦ కండనె యుండిన, నెద్దియేనియున్ సలుపుచునున్న, నూరకొని ♦ న, న్దలపెట్టిన, మానిన, న్సదా కలికిమనోహరాకృతియె ♦ కన్నులఁ గట్టినయట్లు గన్పడున్.

ఆకారణముచేత:—

చ॥ వినుతునొ, విందునో, నిశల ♦ వేగుదునో, నిదురింతునో, మిము న్గనెదనొ, కానకుందునొ, సు ♦ ఖంపడుచుంటినొ, స్రుక్కుచుంటినో చనెదనొ, నిల్చియుండెదనొ ♦ సాపడుచుంటినొ, మానుకొంటినో మనెదనొ, లేనొ, నేనెఱుఁగ ♦ మానస మామెయెడ న్లయించుటన్.

చిత్రాం—ఓహృదయమా ! నీ వింకను బిడ్డలు కా వేమి ?

వైశ్యా—దీనికై లోలోపల నింత కృశింప నేల ? ఆమె యెవ్వరికన్నియయో తెలిపిన నిమేషములోఁ గార్యము నెఱవేర్చుకొని రానా?

యువ—అహో ! అంతవఱకుఁ దెలిసిన నింక లేని దేమి ?- ఆసమయమునఁ దండ్రిగారుకూడ నచటనే యుండుటచేత- నామెంగూర్చి యామంత్రికారునితో మాటాడ వీలు లేకపోయినది. అంతలోఁ గుంతలమున కరుగవలసి వచ్చినది.

లలి—(జనాంతికముగా) సఖీ ! యీపలుకునదియెల్ల నిన్నుఁగూర్చి యేల కాఁగూడదు.

చిత్రాం—(జనాంతికముగా) సిభాంతి కేమిలే! రోగి కడ తేరువఱకు నమ్మికఁ జెప్పుచుండువైద్యునివలె మాటిమాటికి నాకు జీవితాశఁ గలిగింపకుము.

వైశ్యా—అట్లయినఁ జూచినయాకృతిని యథాస్థితిగా లిఖించియిమ్ము.

దానిచే నేనామెం దెలిసికొనుటకు యత్నించెదను.

యువ—నీయాలోచన సరియైనదే; కాని-

గీ॥ చిత్తమునఁ దోఁచురూపంబుఁ ♦ జిత్రమందు
భావమునఁ దోఁచుభావంబుఁ ♦ బద్యమందుఁ
బూర్ణముగఁ గూర్పఁ జాలిన ♦ పోడి లెందుఁ
గలరు? నూటికిఁ గోటి కొ ♦ క్కరుఁడు గాక!

వైశ్వా—చిత్రలేఖనమునందు నీకుఁ గలసామర్థ్య మే నెఱుంగనిది కాదు. లేఖనసామాగ్రిని దెచ్చెదను; సంశయపడక లిఖింపుము.

యువ—మంచిది. కానిరమ్ము! ప్రయత్నించి చూచెదను.

వైశ్వా—(నిష్క్రమించును)

చిత్రాం—(జనాంతికముగా) ఊతఁముకూడఁ దగినవాఁడె దొరకెను.

వైశ్వా—(లేఖనసామాగ్రిని దెచ్చును)

యువ—(ఎడనెడ నాలోచించుచు లిఖించును)

వైశ్వా—(చూచి) ఓహోహో! ఇది నీవ్రాఁతనేర్పా, లేక నిజముగా నీమె యింతటి సౌందర్యవతియేనా?

యువ—బుద్ధి వినియోగపఱచి పోలికలుమాత్రమె వ్రాయఁ గలిగితిని.

చిత్రాం—(జనాంతికముగా) ఓకుచ్ఛితబ్రాహ్మణుఁడా! ఆయనపాటకుఁ దగినతాళము నేర్చుకొని చక్కఁగాఁ బొట్ట పోషించుకొనుచున్నావు.

యువ—చెలికాఁడా! యీయామెను జేపట్టునదృష్టమునకుఁ బాత్రుఁడ నగుదు నని నమ్మకముమాత్రము నాకు లేదు. ఏమందువా?

గీ॥ ఆపదలయందుఁ దోడ్పడు ♦ నట్టిహితుఁడు,
సత్సభారంజనముఁ జేయఁ ♦ జాలువిద్య,
మతివరించినయానినీ ♦ మణియుఁ బుణ్య
వంతులకుఁ గాక యబ్బునే ♦ వసుధలోన?

(తెరలోఁ గలకలము)

యువ—(విని) ఏమిది? అసమయమందు రణభేరి మ్రోయుచున్నది!

వైశ్యా—ఏదియో సంభవించినది! వామనుఁడు రొజుచుఁ బరువెత్తుకొని వచ్చుచున్నాఁడు.

యువ—అట్లయిన నీచిత్రము నెచ్చటనయిన దాచుము.

వైశ్యా—(ఒకలతాగృహమున దాచును.)

వామ—(తొందరతోఁ బ్రవేశించి) కుమారమహారాజుగారికి జయమగుఁగాక! కళింగరాజనందనను దోడ్కొని హరిశర్మామాత్యులవారును పరివారమును వచ్చుచుండఁగా, విజయభూపతిసైన్యము ముట్టడించి, కొందఱను హతము గావించి, మిగిలినవారిని పాశబద్ధులం జేసి కొనిపోయిరి. ఆసమయమున నేను-ఆరాజసుతతోఁ దప్పించికొని వచ్చితిని. ఈవృత్తాంతమును విని మహారాజుగారు లయకాలరుద్రునివలె మండిపడుచు, విజయభూపతిని రూపుమాపి హరిశర్మాదులను విడిపించుకొనివచ్చుటకుఁ బయనము కాఁగా, సుబుద్ధిగారు వారించుచున్నారు. ఇంతలో నీసంగతిఁ దమకు విన్నవింప వచ్చితిని.

యువ—ఔరా! విజయభూపతిసాహసము?

ఆ॥ వె॥ రొట్టకట్టుచోటఁ ♦ బుట్టగోచిని బెట్టి
నతఁడు పట్టభద్రుఁ ♦ డనినయట్లు
కొండవాండ్రు తన్ను ♦ గొండంతవాఁ డన
నాకసమును ముద్దు ♦ లాడఁ జూచె.

కానిమ్ము, తనమూర్ఖతకుఁ దగినఫలమును వెంటనే యనుభవించును. సఖుఁడా! నీవు క్షణ మాఁగి, చిత్రమును గొనిరమ్ము.

వైశ్యా—అచ్చట జరుగుముచ్చటలను నేనుమాత్రము వినవలదా?

ఇప్పటికి నీతో రానిమ్ము; చీఁకటిపడినవెనుక వచ్చి, చిత్రమును గొనిపోయెదను.

యువ—మంచి దట్లనే కానిమ్ము. (నిష్క్రమింతురు)

లలి—సఖీ! వారు చిత్రమును విడచియే చనిరి. అందు లిఖంపఁబడిన దెవ్వతెయో పోయి చూతము రమ్ము.

చిత్రాం—ముందు నాజీవితమును బోఁగొట్టుకొనుటకుఁ దగిననన్నాహము గావించి, తరువాత నీవు పోయి సావకాశముగాఁ జూడుము.

లలి—(విసుగుతో) అబ్బబ్బా! అమంగళములు పలుక కమ్మా!

చిత్రాం—పోనిమ్ము; పోయి కొనిరమ్ము. అధన్యాత్మురా లెవ్వతెయో యరసియే ప్రాణముల విడచెదను.

లలి—(పోయి చిత్రమును జూచి) ఆశ్చర్యమాశ్చర్యము! పూలదండను భుజంగ మనుకొంటిమి. సఖీ! యిందు లిఖింపఁబడినయదృష్టవంతురాలవు నీవే!

చిత్రాం—మూర్ఖురాలా! యిటువంటిస్థితిలోనా యెగతాళి?

లలి—మొదటినుండియు నే నెంత మొత్తుకొనుచున్నను, నాపలుకుల నిట్లే పాటించుచుంటివి. ఎగతాళియో- నిజమో- యిది చూడుము.

చిత్రాం—(చూచి, తటాలునఁ గౌఁగిలించుకొని) సఖీ! యేమియాశ్చర్య మిది? మనకన్నులు మనలను మోసపుచ్చుట లేదు కద?

లలి—హృదయ దౌర్బల్యముకలవారి కన్నియు సందియములే.

చిత్రాం—సరి కాని- సంగతి సందర్భానుసారముగా లే దేమి?

లలి—ఎందుచేత?

చిత్రాం—ఎందుచేతనా? తమవారు తమనిమిత్తము నన్నుఁ గొని వచ్చియుండఁగా- ఆర్యపుత్త్రుఁడు నాపేరుసైతఁ మెఱుంగ నని పలుకుచుండె నేమి?

లలి—ఊరకుండుము. ఎవ్వరో వచ్చుచున్నారు.

పుష్పాంగి—(ప్రవేశించి) అమ్మా! మీకు శుభ మగుఁగాక! నేను మహారాజుగారి పరిచారికను. పేరు పుష్పాంగి. మహారాజుగారు మిమ్ముఁ జూడ వచ్చి- తోఁటవెలుపల నిలచి- తమరాకఁ దెలుపుటకు నన్నుఁ బంపిరి.

చిత్రాం—(వెల్లఁదనముతో లలితాంగివంకఁ జూచును)

లలి—మహారాజుగారా? యువరాజుగారా?

పుష్పాం—యువరాజుగా రేల వత్తురు? నిరంతర మేమహారాజుగారిమెప్పులకు సంతాపస్వాంతులై యుండి పాణిగ్రహణమున కెదురు చూచుచుండిరో- యామహారాజుగారే- మీ కపకార మొనర్చిన విజయభూపతిని రూపు మాప వీరభటుల నంపి మిమ్ముఁ బరామర్శింప దయచేసినారు.

లలి—మంచిది; దయచేయఁ గోరుచున్నా మని మనవిచేయుము. మేమును జతుశాలకడకు వచ్చుచున్నాము.

పుష్పాం—(పోవును)

చిత్రాం—(భయముతో) సఖి! ఇది యేమివింత?

లలి—విచారించిచూడఁగా నీమహారాజు మనల మోసముచేసిన ట్లు తోఁచుచున్నది. మన మిందులకు వచ్చితిమో యాయన మనల నెఱుఁగకుండుట కిదియు కారణ మైయుండును. కాని మేమి జరుగునో చూతము; నీవుమాత్రము ధైర్యము వహించి యుండుము.

చిత్రాం—(రొమ్ము కొట్టుకొనుచు) అమ్మయ్యో! యిఁక నెక్కడి ధైర్యము? హా పరమేశ్వరా! ఎంతవంచనచేసితివి? (విలపించును)

లలి—(కనలో) అకటా! గొప్పవిపత్తు సంప్రాప్త మైనది. మృగములు వేఁటకాని వెఱ కాసించి- యురుల నెఱుంగలేకపోయి

నట్లు- యీధూర్తనృపాలుని దుస్తంత్రమించుకయుఁ దెలిసికొన
లేకపోతిమి! (ఆలోచనతో) దీని నేమార్గమునఁ దప్పించుకొన
నగును? (సమాధానముతో) కాని యిట్లు చేసెదను. అశుభ
కార్యములకుఁ బ్రతిక్రియ కాలయాపన మని కదా పెద్దలు చెప్పు
దురు? కాఁబట్టి యీయుపాయముచేత నిప్పటికిఁ దప్పించుకొనిన-
పైసంగతి పిమ్మట విచారించుకొనవచ్చును. (పైకి) సఖీ! యింత
లోనే యేల బేల వయ్యెదవు? భగవంతుఁడు- శూరులను యుద్ధ
ముచేతను; దాతలను లేమిచేతను, బుద్ధిమంతుల నాపదలచేతను
గదా పరీక్షించు నని చెప్పుదురు? నేను బ్రాణముతో నుండఁ
గా నీ కించుకయేని కోపము సంభవించునా? నీవు రాజుకంటఁ
బడక లోపల నుండుము; నే నాయనకుఁ దగురీతిగా సమాధానము
చెప్పి పంపివేసెదను.

చిత్రాం——(దుఃఖముతో) అంతఃపురమున నేమిప్రయోజనము?
మరణమే శరణముగా మానము కాపాడుకొనవలసినదే; కాకు
న్న మన మీచిక్కుఁ దొలఁగించుకొని బయటఁ బడఁగలమా?

లలి——వెఱ్ఱిదానా! విధి యనుకూలుఁ డైనచో నెంతటికష్టములైన
మంచువలె విడిపోక మానవు. జాలరివానివలలోఁ జిక్కువడిన
మత్స్యము లెన్ని బయటఁబడి బ్రతుకవు?

చిత్రాం——గీ॥ పన్నగమునోటిలో నిట్టి ♦ పట్టువడిన
కప్పనుం జూచి చిరఁజీవి ♦ కమ్మటంచుఁ
బలికినటువలె లలితాంగి! ♦ పలికె దీవు,
మానరక్షణ మగునె నీ ♦ మాటవలన?

(ఆలోచించి) కానిమ్ము, నడువుము.

ఇది తృతీయాంకము.



శ్రీ

మేధాదక్షిణామూర్తి పరబ్రహ్మణేనమః

# చిత్రాభ్యుదయము

## చతుర్థాంకము

ప్రదేశము—చతుశ్శాలాభవనముకడ నొక చిన్నయిల్లు.

[ లలితాంగి పురుషవేషముతోఁ బ్రవేశించును.]

లలి—ఔరా! ఎంతదారుణ మెంతదారుణము! యేమిపాపమో కాని రాజులలోఁ జాలమంది యిటువంటియకృత్యములనే సలుపుచుందురు; కావుననే రాచసిరి లేఁడివలె దాఁట్లువేయుటయు, వారిగృహములు శరత్కాలమేఘములవలె నీరసములవుటయుఁ దటస్థమగుచుండును. (ఆలోచించి) సాధ్యమైనంతవఱకు యీరాజుమానము సాగకుండుటకే గదా నే నిట్టివేషమునుగూడ వేయవలసివచ్చినది! నా ప్రయత్నమున కింకొకరుగూడ సాయ ముండిన నెంతయో యనుకూలముగా నుండును.

తెరలో—(తలుపుఁ దట్టుచు) లలితాంగీ! లలితాంగీ!

లలి—(తనలో) ఎవ రది? కంఠస్వరము శుభాంగిదివలె వినిపించుచున్నది. అవును, ఆమెయే. (పైకి) ఆఁ! వచ్చె; వచ్చె; (పోయి

పాగాయును జొక్కాయును దీసివేసి తలుపుతీయున ట్లభినయింపఁ గా- శుభాంగి ప్రవేశించును).

లలి—(తటాలునఁ గౌఁగిలించుకొని) శుభాంగియే! యెప్పుడు వచ్చితివే? యెట్లు రాఁగలిగితివి? యింతకాల మెం దుంటివి?

సుంద—మమ్ము విడిపించుటకై మహారాజు పంపిన పరివారమునకును విజయభూపతి సైన్యమునకును గొంతకాలము ఘోరమైన యుద్ధము జరిగినది. ఆకల్లోలములో నే నెట్లు బయటఁబడుదునా యని యాలోచించి చివరకు పురుషవేషముతో సైనికులలోఁ గలసితిని. అంతట నాముట్టడిలోఁ గాలికిఁ గత్తిపోటు తగిలి మూర్ఛిల్లఁగా నన్నుఁ జచ్చినట్లుగా భావించి వారు విడిచిరి. తరువాతఁ గొంతసేపటికి తెలివిరాఁగా నే నొకపల్లెం జేరుకొని, యెవరో పుణ్యాత్ము లు చికిత్సఁ జేయఁగాఁ గ్రమముగా నారోగ్యముఁ గాంచి, యీ ప్రొద్దుటనే వచ్చి రాజకన్యం జేరుకొంటిని. వచ్చినప్పటినుండియు నిన్నుఁ జూడవలె నని యాతురపడి యిటు వచ్చితిని. సరికాని- యీవిధముగా రాజు చేసిన మోసము తేలపడినను మీ రిచ్చట నుండి యేల కదలిపోలేదు?

లలి—వెఱ్ఱిదానా! వేటకాఁడు తనయురులలోఁ దగుల్కొనినమృగ మును దప్పించుకొని పోనిచ్చునా?

సుంద—పోనిమ్ము; మనమహారాజున కీవృత్తాంత మేల తెలియఁజేయ లేదు?

లలి—అందువలనమాత్ర మేమి ప్రయోజనము కలదు? ఆయన యి య్యవమానమునకు సహింపలేక ప్రాణత్యాగమైనఁ జేసికొనును- వీరితో యుద్ధమునకైన డీకొనును. సంగరమునందు జయాపజయ ములు దైవాధీనములు కదా! ఒకవేళ మనవారే గెలిచి మనలను విడిపించుకొని పోదురే యని యూహింపుము. ఒకరిచే వరింపఁ

బడిన యీామెను మఱియొకరు వరింపరు. ఒకరిని వరించిన యీా మె మఱియొకరిని వరింపదు.

సుంద—నీవు పలికిన వన్నియు యథార్థములే; కాని యీావిపత్స ముద్ర మేవిధముగా దాటనగునో నాకుఁ దోఁచకున్నది.

లలి—వజ్రమును వజ్రముచేతనే భేదింపవలసినట్లు తంత్రమును దంత్ర ముచేతనే భేదింపవలెను. నేను చేసినది తెలిపెద వినుము. రాజున కీమె నగపడకుండఁ జేసి "మా రాజనందన కన్యాగారీవ్రతము సలు పుచున్నది. వ్రతము ముగియుట కింకను నెలదినములు పట్టును. తావత్పర్యంతము పాణిగ్రహణము కాని, పురుషదర్శనము కాని కాఁగూడదు. కావున నంతవఱకు వ్రతభంగము కలుగకుండుటకై మాకుఁ గోటలోఁగాక వేఱుచోట నివాస మేర్పఱుపుఁడు" అని నేను బొందికగాఁ దెలుప నందుల కాయన సమ్మతించి మా కాసౌధ మొసంగెను.

సుంద—అప్పటికి తప్పించుకొనుట కది మార్గమే; కాని యిప్పటి కా నెలదినములుంగూడఁ గావచ్చెను గదా! యింకఁ జేయవలసిన దేమి?

లలి—యువరాజుగారి నెట్లయిన నాసౌధమునకు రప్పించవలె నని ప్రయత్నించితిని.

సుంద—రప్పించిన ?

లలి—తెలియవచ్చినసంగతులఁబట్టి యూహింపఁగా- నీమెచ్ఛాయాపట మును విలోకించి, తండ్రికొడుకు లిరువురును వరించి రనియుఁ, గు మారున కీమెయూరుపేరులు తెలియకపోవుటచేత విరహపీడచేఁ గృశించుచుండె ననియుఁ, దండ్రి యీామెవివరము తెలిసికొని తా ను వృద్ధుఁ డగుటచేఁ గార్యసాధనముకొఱ కీదుస్తంత్రముఁ బన్నె

వనియుఁ దోఁచుచున్నది. కాఁబట్టి యువరాజుగారికి జరిగినదంత యు వినిపింతుమేని ఆయనయే యన్నియుఁ జక్కఁబఱచును.

సుంద—మేలు! మేలు! నీయోజనము కొంచి యూడఁ దగియున్నది. సరి కాని. భర్తృదారికస్థితి యెట్లున్నది?

లలి—ఎట్లున్నదని చెప్పుదును? గడువు కాలముకూడఁ గావచ్చినం దునఁ గంటికిమంటికి నేకధారగా నేడ్చుచున్నది. నిన్నటినుండి బొత్తుగా నన్నము ముట్టుట లేదు. రెప్ప వాల్చుట లేదు.

సుంద—నీప్రయత్న మెంతవఱకు నెఱవేఱినది?

లలి—దాదాపుగా నంతయు నెఱవేఱిన దనియే చెప్పవచ్చును.

సుంద—ఏమిప్రయత్నము చేసితివి? ఎట్లు చేసితివి?

లలి—ఇదిగో వినుము:- పురుషవేషముతో సాకల్యుఁ డనుపేర నే నీయింట నివసించుచు, యువరాజుగారితో నే నొకదూరదేశపు మంత్రిపుత్రుఁడ ననియు, దేశాటనము సలుపుచు నిచటకి వచ్చితి ననియుఁ జెప్పి ఆయనతో స్నేహముఁ జేసితిని. ఆమహాభాగు నితో నాకుఁ గలిగినచెలిమి నానాఁటి కభివృద్ధి యయి, ఇప్పు డా యన-నేను లేకుండ నిమేషమేనియుఁ గడపలేనిస్థితిలోనికి వచ్చినది. వేయేల?

> గీ॥ కుడుచునప్పుడు పంక్తిని ♦ గూర్చుఁ జెందు
> నపుడు ప్రక్కను విహరించు ♦ నపుడు తోడ
> నున్నచో నారగించును ♦ గన్ను మూయు
> నడుగు వేయును లేకున్న ♦ నన్ని రోయు.

కాఁబట్టి కొంచెము వీలు చూచి యాయనను మనరాజనందన సౌధమున కెట్లయిన రప్పించుతంత్రమును బన్నవలెనని యోజించి చివర కీదినమున నది నెఱవేఱునట్లు చేసితిని.

సుంద—ఎట్లు?

లలి—యువరాజగారును నేనును యుద్యానవనమున కరిగి విహరించు చుండఁగా- నొకపుష్పగుచ్ఛ మాయనకింటఁ బడినది. దానియం దాయనకుఁ గలయభిలాషను గనిపెట్టి యాగుచ్ఛమును గోయుట కరిగి యటఁ బాముకఱచి పడిపోయిన ట్లభినయించితిని.

సుంద—ఔరా! ఎంతపని చేసితివి?

లలి—కళింగరాజనందనసౌధమున నొకయోగిని కలదనియు, నామెకు మంత్రతంత్రము లనేకములు తెలియు ననియు, నామెకుఁ దెలిపిన నామధ మొసంగు ననియు నేమూర్ఛఁబోవునపు డాయనకుఁ దెలిపి యుంటిని. ఆయనకు నాయందుఁ గలయభిమానము ననుసరించి స్వయముగా నాయనయే మనసౌధమున కరుదెంచు నని నానమ్మకము. అందుచే- ఆ యుద్యానవాటినుండి బయలువెడలఁగానే దగ్గరతోవను నే నిట కరుదెంచి పురుషవేషము దీసివైచి- భర్తృదారికకడ కరుగఁదలఁచినంతలో నీవు వచ్చితివి. నీసహాయము కూడ నిపు డత్యవసరము.

సుంద—అట్లయిన ధన్యాత్మురాలను. నీయిష్టానుసారము న న్నుపయోగించుకొనుము.

లలి—నీవు యోగినీవేషముతో భర్తృదారికకడ నుండుము. ఆయన వచ్చువేళకూడ యయినది, కావున నాలసించక ఆపెరటిదారిని భర్తృదారికకడ కరుగుదము పద.

(నిష్క్రమింతురు-)

[అంతటఁ దెర యెత్తఁగాఁ గళింగరాజనందన సౌధము]

యువ—(ప్రవేశించి) ఆతని యునికిం దఱుచుకొన నాకు మిగుల దిగులుగా నున్నది.

మ॥ కలిగెం జెమ్మట దేహమంతటఁ గడుంగంఠంబు మారొంపెడిఁ జే తులుఁగాళ్ళున్నివశంబులయ్యె మతియెంతో మాంద్యముంజెందెఁగ

న్నులు మూతల్పడెఁ జెంగలువపతిలె నేను నాప్రియమున్నే! కటా! చెలికాఁ డేస్థితియుండెనో యిపుడు! నా • చిత్తంబు కంపించెడున్.
దేనివలన నేదిసంభవించునో తెలియదుకదా!

గీ॥ అతిమదంబునఁ బూవు గో • యంగ నతఁడు
పాదపం బెక్క నంతలోఁ • బాము కఱచె;
మహిని సద్భక్తిచేత న • నాగరాజు చేయఁ
గడఁగిన మనీషి పిడుగు పైఁ • బడినయట్లు.

(నిట్టూర్పుతో) ఆకాంచన పుష్పగుచ్ఛముపై నాకుఁ గలిగిన యభిలాష యింతకష్టమునకుఁ గారణ మైనది.

గీ॥ ఏను జెలికాని నేల చె • ట్టెక్కుమంటి !
నెక్కెఁబోఁ బాపపుంబాము • దేల తోఁట
నుండె! నక్కట! కుడిచి కూ • ర్చుండలేక
చెట్టుఁ గొట్టి పై వేసికొ • న్నట్టు లయ్యె.

(కొంచముసే సాఁగి) ఇదియే కళింగరాజనందన నివసించు సౌధము. ఇచటనే కదా యోగిని యుండు నని నాప్రియమిత్రుఁడు సాకల్యుఁడు చెప్పెను. కాని, నారాక యోగినికిం దెల్పువా రెవ రైన నిచట దొరకిన బాగుండును. ఆలస్య మైనచో నాతనిస్థితి యెటు లుండునో! (విని) మట్టెలచప్పుడు వినవచ్చుచున్నది. మందిరములోనుండి యెవరో వచ్చుచున్నారు.

లలి—(చూచి, ఆశ్చర్య మభినయించుచు) కుమారమహారాజుగారికి శుభ మగుఁ గాక!

యువ—(చూచి) నీ వెవరవు?

లలి—మహాభాగా! నేను కళింగరాజనందనకుఁ బ్రియసఖిని; పేరు లలితాంగి యందురు.

యువ—అలాగునా! లలితాంగి ! యిచట నొక యోగిని కలదని విం
టిని; నిజమేనా ?

లలి—నిజమే-

యువ—నే నొక యత్యవసర కార్యము గురించి యామెను
దర్శింప వచ్చితిని, కావున నా రాక యామెకుఁ దెలిపెదవా ?

లలి—చిత్తము- ఇచటనే యుండుఁడు; ఆమెకుఁ దెలిపి యిప్పుడే వ
చ్చెదను. (పోవును)

యువ—కటకటా ! విధి యీతని నిందులకే యిటుల రప్పించెను గాఁ
బోలు ! సందియ మేమి ?

గీ॥ గ్రుడ్డివానిని జేపట్టు • కొని యొకండు
ముందు నడచుచు దారిఁ గొం• పోవురీతి;
విధి పురోగామి యై నడి • పించుచుండుఁ
బావఁగఁ బ్రాణికోటుల ఫల • భూమికడకు.

లలి—(ప్రవేశించి) ఆమె యిప్పుడే గీతాపారాయణము ముగించి
కూర్చున్నది. రండు.

ఇద్దఱు—(నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.





శ్రీ

మేధాదక్షిణామూర్తి పరబ్రహ్మణేనమః

# చిత్రాభ్యుదయము

## పంచమాంకము

---

చిత్రాంగి భవనము.

[ యువరాజుతో లలితాంగి ప్రవేశించును ]

లలి—తమరీయాసన మలంకరింపుఁడు. తమరాక యామెకు విన్నవించెదను. (నిష్క్రమించును.)

యువ—(ఆసనముపైఁ గూరుచుండును.)

చిత్రాం—(యువరాజున కెదురుగా నున్నతెరమరుగునఁ బ్రవేశించి జనాంతికము) అహో! నాజీవితమున కాధారభూతుఁడైన యార్యపుత్రుఁ డదృష్టవశమున మఱలఁ గంటఁ బడినను నాకన్నులను నేను నమ్మలేకున్నాను.

తాపసి— (ప్రవేశించును.)

యువ—(లేచి) భగవతి, నాప్రణామములను స్వీకరించుఁగాక.

తాప—వత్సా! నీకుఁ గళ్యాణసిద్ధి యగుఁగాక! కూరుచుండుము!

యువ—పూజ్యురాలా! నాకుఁ గూరుచుండుటకుఁ దగినయవకాశము

లేదు. ఒకానొక మహాత్కార్యముకొఱకు మీయనుగ్రహముఁ
గోరి వచ్చితిని. నావేగిరపాటునకు మన్నించినచో మద్వాంఛిత
మును విన్నవించుకొందును.

తాప—(ధ్యానించి) నీవు చెప్పనక్కఱ లేదు. నీమిత్రుఁడొకఁడు సర్ప
దష్టుఁడు కాఁగా నతని బ్రతికింపుమని కోరి వచ్చితివి.

యువ—(ఆశ్చర్యముతోఁ దనలో) ఈమె నామనోగతము నెంతలో
నెఱుంగఁగలిగెను. తపస్సిద్ధి కలవారిచరిత్రము లత్యద్భుతములుకదా!

మ. జలధు ల్గుప్పిక్కకు లోఁబడున్, ◆ జమునిపాశంబు వ్యర్థమైచనున్
వెలయు న్నెండవస్వర్గము న్నడచు నె◆న్నొంట న్నదు ల్స్రైతమున్
గలుగు న్సంతతి వంధ్యకు న్గరియు మే◆ఘుంబుల్ సువృష్టి న్మహా
త్ములకు న్సాధ్యము కాని దొండుఁ గలదే ◆ బుద్ధి న్విచారింపఁగన్.

(పైకి) ఓపూజ్యురాలా!

కం. తొలిఁ జేసికొన్న పున్నెము
వలన న్నీదర్శనంబు ◆ వాటిలెఁ గానన్
వెలయించి యతనియుసురులు
కలిగింపుము నాకు మిత్రుఁ ◆ గారుణ్యమునన్.

తాప—వత్సా! మే మిట్టివంటపనులలోఁ బ్రవేశింపరాదు. అయినను
నీమాటఁ ద్రోసివేయఁజాలక సమ్మతించితిని. (మఱల ధ్యానించి)
వత్సా! నీమిత్రుఁడు విషవిముక్తిం జెందెను. అతనికడనుండి యిప్పు
డే వర్తమానము రాఁగలదు.

యువ—ఈమెమహిమకు నిదర్శనము కనఁబడినను నా కీవిషయమున
నమ్మకము కుదురకున్నది. ఏమా?

గీ. నిక్క మగు నేరిపలుకేని ◆ నొక్కొక్కపుడు
కాకతాళీయముగ నట్లు ◆ గాన వారిఁ

దఱచి చూడక నమ్ముటఁ ♦ దగవు కాదు
జగతిలో మిడసంభట్టు ♦ చరిత వినమె.

లలి—(ప్రవేశించి) మహాభాగా! విషబాధ నివారణ కాఁగా సాకల్యుఁడుగారు లేచి కూర్చుండి, సంతోషముతో మిమ్ముఁ గాఁగిలింపఁ గోరుచుండి రని మనవి చేయ వచ్చి సేవకుఁ డొకఁడు ద్వారముకడ వేచియున్నాఁడు.

యువ—(ఆనందముతోఁ దనలో) ఇప్పుడు సందియము తీఱినది. (పైకి) లలితాంగీ! భగవతియనుజ్ఞ వడసి యిప్పుడే వచ్చెద నని చెప్పి వచ్చినవానిని బంపివేయుము.

లలి—చిత్తము. (పోవును)

యువ—ఓహో! భగవతీ!

చ. కరుణమెయి న్మదీయసఖుఁ ♦ గావఁగ యోగినిరూపుఁ దాల్చి, చె
చ్చెరఁ జనుదెంచినట్టి శ ♦ శేఖరుపత్నివి నీవు కానిచో
నరు దగు నిట్టిదివ్యమహి ♦ మాతిశయంబులు కల్గనేర్చునే
నరులకు? నీయనుగ్రహమున ♦ జ్జరితార్థుఁడ నైతి నెంతయున్.

తాప—తపస్సిద్ధికలవారి కిది యొకఘనకార్యము కాదు; దీని కేమి? నీవినయసంపత్తికి చాల సంతసించితిని. మావంటివారి సంతోషము వృథ కాఁగూడదు. కావున నీ కొకయోషధిం దెచ్చి యిచ్చెద; దానిం ధరించుటచేత నిన్ను విషబాధ లంటకుండుటయే కాక, అంటినవానిని నీవు ముట్టినను తత్క్షణంబ తద్విషము హరించును.

యువ—భగవతీ! గొప్పవారియనుగ్రహమునకుఁ బాత్రుఁ డైనవాని కేమి సిద్ధింపదు?

తాప—ఇప్పుడే వచ్చెదఁ గూరుచుండుము. (నిష్క్రమించును)

లలి—(ప్రవేశించి తనలో) ఇక్కడ కీతంత్రద్రుమము చక్కఁగా ఫలించినది. ఇఁక ముఖ్యాంశమునఁ బ్రవేశింపవలెను. (పైకి) ఓహో! యువ

రాజుగారికా మిత్రునిపై నెంతయనురాగమో కదా! కాకున్న నింతగా శ్రమ పడుదురా?

యువ—లలితాంగీ! ఇందు నేను పడినశ్రమ మేమున్నది?

లలి—ఉపేక్ష సేయక యిచటికి స్వయముగా వచ్చుటయే.

యువ—ఇంతే కదా!

గీ. తనకతంబున నొకనికిఁ ♦ దనువుఁదొఱఁగు
నంతటివిపత్తు సంప్రాప్త ♦ మైనయప్పు
డెవఁ డుపేక్షించుఁ? బ్రాణంబు ♦ లేని నొసఁగి
వానిఁ గాపాడుయత్నము ♦ మాని ధరణి!

లలి—నాయభిప్రాయ మట్టివారు లేరని కాదు.

యువ—మఱేమని? నేను వారిలోఁ జేరినవాఁడను గా ననియా?

లలి—(చిఱునవ్వుతోఁ దల వంచుకొనును.)

యువ—ఏమిది వినరానిమాట వింటిని! (కొంచె మాలోచించి తనలో) కాని మిమ్మామెనే యడిగెదను. (పైకి) లలితాంగీ! నీపలుకులు నాహృదయమును గలఁగించుచున్నవి. నావలన నెవరి కేమియపకృతి యావహిల్లెనో చెప్పుము. సాధ్య మగునేని సవరణ చేయుదును.

లలి—మహాభాగా! మందభాగ్యురాలను నే నంతవఱకు సాహసింపఁగలనా?

యువ—కాదు కాదు; ముఖ్యముగాఁ జెప్పఁదగును.

గీ. తనదుకన్నులు తనమోముఁ ♦ గనఁగలేని
యప్పు డద్దంబు తోడ్పడి♦నట్లుగానె
తాను దనదోషము లెఱుంగ ♦ లేనియపుడు
పరులు తోడ్పడి వానిఁ జూ♦పంగవలయు.

లలి—తెలిపెదననుకొందు; ఏమిలాభము? నానోరు వెలియగుటయే కాని మీరు కర్తవ్యమునకుఁ గడంగరు.

యువ—అట్లనెద వేమి ?

గీ. తనకు దుష్కీర్తి రానున్న ♦ తఱి నెవండు
దాని వారించుకొనఁ జూడఁ ♦ దలఁపకుండు
మును శమంతకమణిఁ గూర్చి ♦ మురవిరోధి
పడినపాట్లెల్ల నపకీర్తి ♦ నడపఁ గాదె ?

లలి—పోనిండు. నాయం దీనింద యేల? తెలిపెదను వినుఁడు. ఒకా నొక సుందరీమణి మిమ్ము వరించి—తన యభిప్రాయము మీకుఁ దెలుపుట కవకాశము చిక్కనందున—మనోవ్యథచేఁ గృశించుచుఁ-జివరకుఁ బ్రాణత్యాగము సేయుటకుఁగూడ సిద్ధముగా నున్నది. పరులకు మీవలన బాధ కలుగరా దనుతలంపు మీకు గలదేని, మీ యామిత్రుని ప్రాణములవలెనే యామెప్రాణములను గూడ నిలుపుటకు వేగిరింపుఁడు.

యువ—(తనలో) ఈమె హాస్యకర్త్రి కాదు కదా ? (పైకి) లలితాంగీ! ఏమి యింత అసందర్భముగా మాట్లాడుచున్నావు ?

లలి—సహ్యములు కానపు డట్లనే తోఁచును.

యువ—అనృత మెవ్వరికి సహ్యముగానుండును ?

లలి—మీవంటివారితోనా యనృతము ?

యువ—ఏమి నీవు పలికినది సత్యమేనా ? మంచిది అట్లనే కానిమ్ము ! నాకుఁ దెలియకుండ నన్ను వరించి- ప్రాణత్యాగముఁ జేసికొనఁదలఁచిన యామెఁ గూర్చి నే నేమిచేయఁగలను.

లలి—గతమున కేమి ? యిప్పుడు తెలిసెను గదా !

యువ—ఇప్పుడు తెలిసిన నేమి లాభము? నాచిత్త మింతకుఁబూర్వమే యొకమత్తకాశినికి దత్తమైనది.

చిత్రాం—(అదరిపాటుతోఁ దనలో) ఓ దైవమా! నన్ను మఱల సందియపుటుయ్యెలలోఁ బెట్టి యూఁపుచున్నావు.

లలి——అట్లగు . సంకను నామె నేల పెండ్లియాడలేదు ?

చిత్రాం——(లోసలో) ఈయన నిశ్చితార్థ మిప్పుడు తేలవలెను.

యువ——ఆవిషయ మతిరహస్య మైనది. అందుచే నీ వడుగరాదు. నేఁ జెప్పరాదు.

లలి——ఓహో! యింతకంటె నన్యాయ మిం కేమున్నది! తా మడుగునది నేను దెలుపవలెనఁట! నే నడుగునది తాము తెలుపరాదఁట!

యువ——పోనీ మ్మట్లనే తెలిపెద. ఒకానొక సుందరీమణిని జిత్రమునఁ జూచి వరించి, యామె నామముకాని గ్రామముకాని తెలియనందున నందులకై యత్నము సేయుచుంటిని.

లలి——(నవ్వుచు) ఓహో! మీయత్నము-కలలో నిల్లుకట్టి మేలుకాంచి గృహప్రవేశమున కాలోచించుచున్న ట్లున్నది. చిత్రమునఁ గనఁబడిన యొకతెపైఁ జిత్తము నిలిపి- అప్పుడేవిరిసిన పూవుతావివంటి మీయెలజవ్వనము వ్యర్థము సేయుటకంటె, మీకొఱకుఁ బరితపించుచు, మీపేరిటఁ బ్రాణత్యాగము సేయుటకు సిద్ధముగా నున్న కన్నియం జేపట్టి సుఖించుట మేలు కాదా ?

యువ——అది సరి కాదు. ఏ మందువా ?

గీ. ఒకతెను వరించి మున్నె వే ♦ఱొకతె నవలఁ
బెండ్లియాడుట యనఁగను ♦ బెండ్లియాడి
నట్టిపడఁతుక విడచుట ♦ యగును గాదె
మహితచిత్తుల కాత్మ ప్ర♦మాణ మగుట.

చిత్రాం——ఈయన కిట్టిధర్మబుద్ధి కలుగుటచే నే నదృష్టవంతురాలను.

లలి——ఈయనచిత్తస్థైర్యము పూర్ణముగాఁ దెలిసినది. ఇఁకఁ బ్రియసఖిని బ్రవేశపెట్టవచ్చును. (పైకి) మహాభాగా! తనుచిత్త మంతగా నాటుకొనుట కామె యేపాటిచక్కనిది.

యువ—లలితాంగీ ! ఒకరిపై నొకరి కనురాగ ముదయించుట కీశ్వర సంకల్పమే కారణము కాని సౌందర్యము కాదు. అయినను, ఆమె యిట్లుండు నని తెలుపవచ్చును, ఆమె కామెయే సాటి. అంత కంటెఁ దెలుపుట కవకాశము లేదు. ఏ మందువా ?

గీ. లేవు పదములు వర్ణింప ♦ లేనెలేవు
గుర్తికై బోరెఁడుగా నైనఁ ♦ గువలయాక్షి
యవయవంబులతోఁ బోల ♦ సర్వము లగు
నట్టియుపమలు తెలుపుట ♦ యెట్టు లింక ?

చిత్రాం—ఎవరికినచ్చినవారిని వా రెంతగానైన మెచ్చుకొందురు.

లలి—మీ రామెను గామించుట కీశ్వరసంకల్పమే కారణ మనుట సందర్భముగానే యున్నది. కాని సౌందర్యమునం దామెకు సాటివారు లే రనుటమాత్రము మీపక్షపాతమును సూచించుచున్నది.

యువ—ఆమెను జూడఁగూడినచో నీవు నట్లే పలుకుదువు.

లలి—(నవ్వుచు) తమకన్నులతోనా ?

యువ—సాహసురాలా ! అసంగతముగాఁ బరిహాసోక్తు లాడెద వేమి ?

లలి—కోపగింపకుఁడు! నే నింతకుఁబూర్వము విన్నవించినకన్నియకన్నఁ జక్కనివా రుండ రని నాయభిప్రాయము.

యువ—అట్లయిన వారిరువురి నెఱింగినవా రది నిర్ణయింపవలెను.

లలి—అందులకు మీరే సమర్థులు. (అని వెనుకటిచిత్రమును గొని తెచ్చి సగము పైఁటచెరఁగుతో మూసి) ఏమెహ్రాత్పలకమునందుఁ దమరు లిఖింపఁబడితి రని తమకు విన్నవించితినో యామె యీామె యె ! ఈమెకుసాటి ఎందేని గలకేని నిర్వచింపుఁడు.

యువ—(చూచి విస్మయముతో) ఆశ్చర్య మాశ్చర్యము !

చ. విను మిటు మేలుకొన్న, నొక ♦ వేళ నొకించుక కూర్కుగన్న, నే వనితముఖారవిందమును ♦ వాల్గనులు న్మనుజెక్కులు న్గడుఁకా

దసరుతనూవిలాసముకు ♦ దద్దయుఁ గన్నులఁ గట్టినట్లుగా
ననయముఁ దోఁచుచుండెడునొ♦యామెయె యీమెసుమీ తలోదరీ!

లలితాంగీ! యేదీ? ప్రియురాలిచిత్రమును మఱల నొకసారి చూపుము.

లలి—(మఱల వెనుకటివలెనె చూపును.)

యువ—(చూచి) ఓహో! యిది నాచేత లిఖింపఁబడినదే. ఫాలభాగమునఁ దిలక ముంచునపుడు మనసుతోఁబాటు చేయికూడఁ గొంచెము సంచలించుటచే నది యిదిగో! కొంచెము స్థానము తప్పి పడినది. (జ్ఞాపకము నభినయించి) సరెసరె- తెలిసినది! దీనిని మేము వెనుక నుద్యానవనమున విడిచితిమి; నీకు దొరకెనుగాఁబోలు! దాని నాధారముగాఁ జేసికొని నన్ను వృథాగా నానలపాలు గావించితివి.

లలి—ఇంతలోనె యనుమానమా? మీరామె నెంతశ్రమపడి లిఖించితిరో అంతకంటె నెక్కుడుశ్రమపడి యామె లిఖించిన మీయాకృతిని జూచియైన నాపలుకుల నమ్ముఁడు. (కప్పిన చెఱఁగుఁ దొలంగిఁచును)

యువ—(చూచి సంతోషముతోఁ దనలో)

ఓహో! ఏమి నాయదృష్టము!

గీ॥ ఏమెకారుణ్యదృష్టి నా♦యెడ నొకింత
యైనఁ బ్రసరించిన న్జాలు ♦ నని తలంతు
నామె తనపజ్జ నన్ను స్వ♦యంబుగా లి
ఖింపఁ దక్కువ యేమి? త♦లంప నాకు.

లలి—ఇప్పటికేని మీసందియము తీఱినదా?

యువ—ఎట్లుతీఱును? దీనిని నీవే లిఖించియుండరాదా?

లలి—అట్లయిన నామెచేతనే తెలిపించెదను. (భయలజ్జాకంపిత యగు చిత్రాంగిని దోడుకొని వచ్చి) ఎవ్వరు లిఖించిరో యీమెనే యడుగుఁడు.

యువ—(చూచి విస్మయానందములతోఁ దనలో) ఓహో! యీమెయే

కద మదీయ నయనచకోరచంద్రికాసారము! బహుజన్మతపఃఫల పరిపాకము! జీవితము! (ఆలోచించి శంకతో) ఒకవేళ నిది స్వప్న ము కాదు కద!- ఏమన?

గీ. ఎన్నిసారులొ స్వప్నమం దీమెఁ గాంచి
కలసి భాషింపఁ బోయి యావల క్షణంబు
లోన మేల్కాంచి నాలోన నేనె త్రపను
గలఁగ బారుట యలవాటె కాకరంబు.

(సంస్మృతితో) కాదు కాదు-నేను మిత్రకార్యముపై నిచ్చటికి వచ్చుటయు, మొదలగునవి తలంపుననే యున్నవి కదా! అట్లయిన నిది కళింగరాజనందన సౌధము కద! ఒకవేళ యీమెయే యా మె కాదు కద! కాదు కాదు. ఏమా? ఆమె పురుషదర్శనము చేయదు; కావునఁ బ్రియురాలె.

లలి—మహాభాగా! ఏమి యాలోచించుచున్నారు?

యువ—ఈమె యిచ్చటికి కెట్లువచ్చె నని.

లలి—చివరకీదియా సందియము? భర్తృదారికా! నీమనోహరునకుఁ గలసంశయమును నీవే తీర్పవలెను.

చిత్రాం—సఖి! నీవుమాత్ర మెఱుఁగవా? మీతండ్రిగారి దుర్ణయము చే నని చెప్పరాదా?

యువ—పాపము శాంతించుఁగాక! మాతండ్రిగారు వరించినది కళింగ రాజపుత్రిని గదా?

లలి—కళింగక్ష్మాతలేశ్వరున కీమె కాక వేఱొకపుత్రిక యెక్కడిది!

యువ—(భయముతో) ఆఁ- (క్షణకాలము నిశ్చేష్టుఁడై తనలో)

చ॥ జనకునిచే వరింపఁబడు చానను నేను వరించినాఁడ నా
జనసము కాల్పనే? యపయశంబును బాపము మోసికొంచు నే

మని జరియించువాఁడ నీక ♦ సందటిలోపల సిగ్గుమాలి ; ఛీ !
మనుజవిరుద్ధ మైన చెడు♦మార్గమునం బడెఁ జిత్త మక్కటా !

చిత్రాం—(తనలో) మబ్బుగ్రమ్మినవెన్నెలవలె నీయాస్యముఖవికాసము క్షణములో మాఱిపోయినది. కారణ మే మైయుండును ?

లలి—మహాభాగా ! క్షణములో మాఱుటేమనఁ గనఁబడుచున్నారేమి? క్రొత్తపెండ్లికొమరులహృదయములందు సహజముగాఁ బొడముసిగ్గు చేత కాదు కదా !

యువ—(కోపముతో) ఓదుస్స్వభావురాలా ! నీచెలినిమిత్తము క్రొత్తపెండ్లికొమరుల నెపమునదుర్వ్యాపార మిఁకఁ గట్టిపెట్టుము.

గీ. దాసి పరిచర్యకును, చేటి ♦ తనియసాగను
దిద్దుటకును, దూతి పొలయల్కఁ ♦ దీర్చుటకును,
సఖియ సద్వర్తనము బోధ ♦ సల్పుటకును
గాదె యుండుట రాచన♦గళ్లయందు.

సఖి వగు నీ వందులకు విరుద్ధముగా—

గీ. చెడుగు నేరిపి యీచేల ♦ శీల మెల్లఁ
గాల్చి యారీతి గంగను ♦ గలుపఁ దగునె ?
పొలమునకుఁ గాఁపుగా నుంచు ♦ వెలుగె దాని
మేయఁ జూచిన రక్షణ ♦ సేయ వశమె ?

లలి—పాపము శాంతించునుగాక! నాదురదృష్టముచేఁ దమ కట్లు తోఁచినది.

యువ—ఛీ! నీ సక్కనిసయము నీఁకఁ జాలింపుము.

చిత్రాం—భర్తృదారకా ! తమ రకారణముగా నాగ్రహించుచున్నారు. ఒకవేళ మాఁటొడ నేమేని దోషము కలదేని తెల్పుఁడు దిద్దుకొందుము.

యువ—నేను మీపై నకారణముగా నాగ్రహించుట లేదు. మీ యందు గొప్పదోషమే కలదు. అయినను దిద్దుకొందు మని పలికి తివి కావున సంతసముతోఁ దెలిపెదను. స్త్రీలకు శీలమును బురుషులకు ధీరత్వమును ముఖ్యాలంకారములు. వివేక ముభయులకు సమానావశ్యకము లే. శీల మన నుపవాసాదులచేఁ గృశించుట కాదు. ధీరత్వ మనఁ బ్రతిపక్షులయెదుట నిర్భయుఁడై నిలుచుట కాదు. స్త్రీ ప్రపంచమమునఁ దన కెవనిపై ననురాగ ముదయించునో జన్మాంతమువఱకు తానవినే మనోవాక్కాయకర్మముల సేవించుచుఁ దదితరపురుషలోకముపై నాదరానురాగ ముంచుట శీలము. పురుషుఁడు పరవనితాపరధనములయందు విముఖుఁడై తనకుఁ బ్రాప్తించినవానితోఁ దృప్తుఁ డగుట ధీరత్వము. ఇప్పటి నీచరిత్రము దయామయుఁడైన యీశ్వరునకుసైత మాగ్రహము కలిగించునది గా నున్నది. నీవు నాతండ్రిగారిచే వరింపఁబడి, నీవును వరించి, తద్వివాహార్థ మిచటికి వచ్చితివి. ఇప్పు డేకారణముచేతనో నీహృదయము మార్చుకొని నీతిబాహ్యమైన మఱియొకమార్గ మనుసరింపఁ జూచుచున్నావు. నీవంటిసత్కులప్రసూతల కిది తగునా ? కాఁబట్టి నాపలుకులు పాటించి—బహుదూరము యోచించి— నీతిభంజకమైనచాంచల్యము విరమించి నీచరిత్రమును బాతివ్రత్యమున కుదాహరణముగాఁ జేయుము.

చిత్రాం—(వినయముతో)శ్రోత్రపేయూష మగు మీధర్మోపన్యాసమును బరమాసక్తితో వింటిని. కాని, పాపము! నాకు సంభవించినయన్యాయము లేశము నెఱుఁగనివా రగుటచేత నన్నుఁగూర్చి మఱియొకలాగున నభిప్రాయ పడితిరి. పోనిండు- దాని కేమి ?—విషయమంతయు విన్న వెనుక నాగుణదోషములు విశదపడక మానవు. మీ రూహించినట్లు నేను మీతండ్రిగారిని గామించి, తద్వివాహార్థమి చటికి

వచ్చి, బుద్ధిచాపల్యముచే నీచిత్రపటికం బొల్చడిసదానను గాను. మీ రా
యమాత్యుఁ డగుహరిశర్మ మీకొంటి కని సంబంధ మొప్పించి.నన్ను
ను నాతలిదండ్రులను వంచించి-నన్నిటకుఁ గొనితెచ్చెను. వచ్చిన
నాఁడే మీతండ్రిగారు నన్నుఁ జూడ వచ్చినందున వీరిమోసము
మాకు వ్యక్తపడినది. నే నందులకు సహింపలేక తత్క్షణమే ప్రాణ
త్యాగమున కుద్యమించియు సఖులచే ధృతిగొలుపఁబడి- యెన్నఁ
కేని మీదర్శనము లభింపకపో వనియు, జరిగిన వృత్తాంత మంతయు
విన్నవించిన నాదరింపకపో రనియు నమ్మి-దైవముపై భారమునైచి-
వ్రతమిషచే నన్యదర్శితను గాక క్షణము లు లెక్కింపుకొనుచు నిందు
వసింపుచుంటిని. పూర్వపుణ్యవిశేషమున నాయదృష్ట మిప్పటికి
ఫలించినది.

యువ—నీవు పలికినప్రత్యక్షరమును నగ్నికణముకంటె శూలముకంటె
నధికశ్రమము కలిగించుచు నాపీనులం జొచ్చెను. ఎవ్వారు సధర్మ
నిరతు లని లోకప్రసిద్ధి గాంచిరో యట్టివారిపై నధర్మ మారో
పించుటకంటె సాహసకార్యము మఱియొకటి లేదు.

చిత్రాం—నిజ మొకానొకప్పు డనిజముగాఁ దోఁచినను నిదర్శనములు
దానిని స్థిరపఱుపక పోవు.

యువ—ఏమి ? నీపలుకులకు నిదర్శనములుకూడఁ గలవా?

చిత్రాం—సందియ మేమి ? చెలీ ! యాఛాయాపట మిటు తెమ్ము.

చెలి—(అట్లు చేయును)

చిత్రాం—ఇందలియాకృతి యెవ్వరిదో నిర్ణయింపుఁడు.

(పటము నిచ్చును.)

యువ—(చూచి) నాయాకృతియే.

చిత్రాం—తమయాకృతి గలపటము నాకడ కెట్లు వచ్చియుండును ?

యువ—అది నీవే చెప్పవలెను.

చిత్రాం — సకలజననయనోత్సవకర మగు దీనిం జూపియే మీవారు మమ్ము వంచించిరి.

యువ — ఇట్టిమహద్విషయమును సమర్థించుట కిది యొకనిదర్శనమా ?

చిత్రాం — ఇంతటితో నామాట విశ్వసింపరని నే ననుకొనకపోలేదు. అది యట్లుండనిండు. మీయింట వివాహములు జరుగునపుడు పెండ్లికొమరుఁడు తరలిపోవునా ? లేక ఖడ్గమును బంపునా ?

యువ — పెండ్లికొమరుఁడే తరలిపోవును.

చిత్రాం — ఔను గద ! యీవ్యవహారమునందు మీతండ్రిగారే తరలి రాక ఖడ్గము నేల పంపిరి ?

యువ — (తనలో) ఇది కొంతవఱకు విచారింపఁ దగినవిషయమే. (పైకి) సౌభాగ్యవతీ ! ఇది యొకనిదర్శనముగా నంగీకరింపనగును గాని గొప్పవారు చేయుకార్యములకుఁ గారణములు సులభముగా స్ఫురింపవు. కావున నాతండ్రిగారు రాచకార్యాభ్యంతరముచేతనో మఱియేకారణముచేతనో తాము వచ్చుటకు వీలు లేక యట్లు కావించియుందురు.

చిత్రాం — మంచిది. అట్లయినఁ బంపవలసిన దెవ్వరిఖడ్గము ?

యువ — ఆయనఖడ్గమునే.

చిత్రాం — సఖీ ! ఆఖడ్గ మిటు తెమ్ము.

లలి — (అట్లు చేయును.)

చిత్రాం — ఈఖడ్గ మెవ్వరిదో తిలకింపుఁడు.

యువ — (చూచి ఆశ్చర్యముతోఁ దనలో) అన్నన్న ! ఎంతపని జరిగినది! నేఁటికి మాకులమునకుఁ గలుగరానియప్రతిష్ఠ కలిగినది. ఎట్టివారిబుద్ధియు నొక్కొకపుడు పెడత్రోవం బడుచుండును.

ఉ. ధీమతు లయ్యుఁ గొందఱు క్షితి న్గడు నెగ్గగువానినేనియుక్ బామరులట్ల సల్పుటకుఁ బాల్పడుచుందు రొకొక్కవేళ; శ్రీ

రాముని యంతవాఁడును కురంగము వెంబడి నేఁగలేదె? సు
త్రాముని యట్టివాఁడు ముని దారను గూరిచి తారులాడడే!

పాపము! నాకతమున నీమె కిట్టివిపత్తు సంప్రాప్తమైన దని వినుటకు మిగుల లజ్జగా నున్నది.

చిత్రాం—పలుకరేమి- యీఖడ్గ మెవ్వరిది?

యువ—నాయదియే యని యందలి నామాక్షరములే తెలుపుచున్నవి.

చిత్రాం—ఈనిదర్శనములు చాలునా?

యువ—ఓకళ్యాణీ! యీమందభాగ్యునికొఱకు నీవు చాల శ్రమపడితి వనుటకు సందియము లేదు. నే నెట్టియుపచారము సలిపియు నీ ఋణముఁ దీర్చుకొనలేను; కావున నింతటితో దీనిని విరమించి నీయభిప్రాయ మేమో తెలుపుము.

చిత్రాం—తేటతెల్లముగా నున్న నాయభిప్రాయమును నాచేతనే- పలికింపవలె ననియా? పోనిండు. తమయభిమతమే తీర్చెదను. మీచే వరింపఁబడి, మిమ్ములను వరించి వచ్చి, యిప్పుడు మీపేరిట ప్రాణత్యాగమునకు సిద్ధముగా నున్న యీదీనురాలిని జేపట్టుటయే న్యాయము. ఇదియే నాయభిప్రాయము.

యువ—నీయభిప్రాయము నందు ధర్మవిరుద్ధ మేమియు లేదు; కాని-యట్లు సేయుటవలన లోకముమాత్రము మనల గర్హింపక మానదు.

చిత్రాం—ఎందుచేత?

యువ—దుర్జనులకు నాలుకలు పెక్కులు. అందుచే వారు మంచిపలికిన నోటనే చెడుగును, చెడుగు పలికిననోటనే మంచి యుఁ బలుకుచుఁ దమజీవితములను బరులజీవితముల నెంచుటతోనె గడపెదరు. అందుచే మనుజు లంతఃపురములలో నున్నను వారిచరిత్రములు వీథులలో నుండును. కావునఁ గీర్తిని గోరువారు దుర్జనుల పెదవులసందునఁ జిక్కువడక జాగ్రత్తగా నుండవలెను.

లలి—(తనలో) ఈసమయమున లోనే నీట నుండరాదు. (పైకి) భగవతి యింకను రాలేదు. (పోవును.)

చిత్రాం—మూఢుడు లెగతాళి చేయుచున్నని విహాంగ మైనదాని నొకల్పకనన్యల దుఃఖపెట్టుట న్యాయమా ?

యువ—నీవు పలికినది సామాన్యగృహస్థులకుఁ గాని మావంటివారికిఁ గాదు.

గీ. అవనినాథులకెల్లఁ బ్రజానురంజ
నంబె ముఖ్యంబు తత్కారణంబుచేత
నే కదా మున్ను రాముఁ డనింద్యచరితు
రాలి నాలిని బనిచె సంరణ్యమునకు ?

చిత్రాం—(రోషముతో) అది రామునిహృదయదౌర్బల్యము నే సూచించును గాని ప్రజానురంజనమును సూచించదు.

యువ—ఈవాక్యార్థములవలన నేమిప్రయోజనము ? కొంచె మోరిమి గలిగించుకొని మంచికాలముకొఱ కెదురు చూచుచుండుము నేనును గర్తవ్య మాలోచించెదను.

చిత్రాం—ఇల్లుకాలుచుండె నని విలపించువారితో "నెప్పటికైన వర్షము కురియక మానదు. మేఘముకొఱ కెదురు చూచుచుండుము" అని పలికిన వానికి నూఱట కలుగునా ? (విచారముతో) అయ్యయ్యో ! మీతండ్రిగారు అపమృత్యువువలె నన్ను హరింప నున్నారు. మీపై ననురాగ ముంచి మీతండ్రిగారితోఁ గాఁపురము సేయుటకంటెఁ బాపము కలదా ? నాశీల మొకరు హరింప నుండఁగా- శరణు జొచ్చిన నన్నుఁ బరిత్యజించుట మీబోటివారికి న్యాయమా ? ఓమహాభాగా ! ఇఁక పలుపలుకు లేల ? మీకుసమర్పింపఁ బడినయీశరీరముపై నిచ్ఛ కలదేని కేపట్టి రక్షించుకొనుఁడు;

లేదేని పరులకంటఁ బడకుండ మంటఁ గలిపివేయుఁడు. (పాదములపైఁ బడును.)

యువ—(తప్పించుకొని, కటకటా! అగ్నిజ్వాలలకంటె నతిదారుణములైన నీపల్కులు వినుచు నిచట నిలువఁజాలను. దయచేసి నన్నింతటఁ బోనిమ్ము. (అని మఱలి నడచును.)

చిత్రాం—(శోకముతో) హా! మనోహరా! హా! దయావిదూరా! చివఱకు నాపలుకులుకూడ మీకు వెగటుగాఁ దోఁచినవా? ఔరా! నాదురదృష్టము! నేను మీతండ్రిగారిచేఁ బొందినపరాభవముకంటె మీచేఁ బొందిన దెక్కుడు. ఛీ! మీ రాదరింపని యీమొండిశరీరమును నేనుమాత్ర మేల యాదరింపవలెను. ఓహృదయమా! నీవిప్పుడీజీవనము విడుచుటకు వెనుదీయకుము. కాని, అనురాగకవచముతోనే ప్రయాణము కమ్ము. అట్లు చేయుటవలనఁ బరలోకమునందైన నీమనోరథము సిద్ధింపక మానదు. కానిచో నీ కింతటికష్టములే సంభవింపకపోవును. రాత్రి మూఁడవఝామున గాఢాంధకారము ప్రబలి వెలుఁగు చేరువలోనె యున్నదని సూచించునట్లు- కష్టములలోఁ గష్టములు ప్రబలి సమీపించుశుభమును సూచించును; కావునఁ గష్టభూయిష్ఠమైన యీశరీరము సంతోషముగానె విడువుము. ఓమాతాపితలారా! మీసంతానమువలన మీ రేమి పడయఁ గోరుదురో దానిని మీకుఁ గలిగింపలేకపోవుటచే సంప్రాప్తమైనలజ్జచేత మీకంటఁ బడనొల్లక-నమస్కారపూర్వకముగా మిమ్ము స్మరించుచున్నాను. ఓ ప్రియసఖులారా!-కాదు! కాదు!-ఓప్రాణఖులారా! మీరు నాకొఱకుఁ బడిన శ్రమయంతయు నడవిఁగాచినవెన్నెల యగుటచే- భరింపరాని యీవేదనవలనఁ బద పద మని గెంటఁబడుచుండుటచేత- మీసెల వడుగకయే చనుచున్నందుకు క్షమింపుఁడు. మఱియు నాకు సంభవించిన యీవిపత్తు నాతలిదండ్రులకేనియుఁ

జెప్పవల దని మీ కాన వెట్టుచున్నాను. ఈలోకమునకును నాకును
సంబంధ మింతటితో సరి. (బిగ్గఱగా) ఓమహాలహరీ ! ఓగోదావరీ !
నీకు నమస్కారము. అపవిత్ర మైన నాశరీరమును బవిత్రముఁగావించి
నాకు మంచిగతియు నభీష్టవస్తుసంగతియు ననుగ్రహింపుము.

(అని నడచును.)

యువ—(తిరిగి చూచి) ఆఁ! ఆఁ !- వలదు, వలదు; సాహసింపకుము !
సాహసింపకుము! (బిగ్గఱగా) అయ్యో లలితాంగి! ఎందుఁ బోతివి ?
మీ రాజపుత్రి గోదావరిలోఁ బడుచున్నది ; శీఘ్రముగా రమ్ము.
ఓకళ్యాణీ!

గీ. నిరుపమానస్థితి న్వెల్గు • నీశరీర
మిట్లు గోదావరిం ద్రోసి • యేల మమ్ము
సందఱిని దుఃఖవార్నిధి•యందుఁ ద్రోతు
వాగు మాగుము నాపలు • కాలకించి. (అని నడచును.)

(తెరలో) హా భర్తృదారకా ! నా యీ జలవస్మరణమునకు
మీరే కారణభూతు లైనను, అట్టిదుర్యశము మీకుఁ బ్రాప్తింప
కుండుఁగాక !

లలి—(రొమ్ము బాదుకొనుచు) అయ్యో ! అయ్యో !! యిం కేము
న్నది ? యువరాజుగారు సమీపింపకపూర్వమే యామె గోదావ
రిలో దుమికినది. కటకటా ! ఎంతకష్ట మెంతకష్టము ! ఆమెపాటు
చూచి హృదయము చెదరిపోవలయును యువరాజుగారు మొదలు
నఱికఁబడినవృక్షమువలెఁ గ్రిందఁ బడిరి.

(అని సత్వరముగాఁ బోవును. తెర పడును.)

ఇది పంచమాంకము.



శ్రీ మేధాదక్షిణామూర్తిపరబ్రహ్మణేనమః

# చిత్రాభ్యుదయము.

## షష్ఠాంకము.

### న్యాయస్థానము.

[న్యాయాధిపతి, వామదేవుఁడు, విద్యాధరుఁడు ప్రవేశింతురు]

వామ—ఆర్యా! యీవ్యవహారమునందు వాది యెవరు?

న్యాయా—మహారాజుగారే.

వామ—మహారాజుగారి కేమి సంబంధము కలదు?

న్యాయా—మహారాజుగా రామెను వివాహ మాడుటచేత.

వామ—వివాహ మింకను గాలేదే?

న్యాయా—ఖడ్గవివాహము జరిగినది కాదా?

వామ—ఖడ్గవివాహ మష్టవిధవివాహములలో లేకపోవుటచేత శాస్త్ర సమ్మత మైనది కాదనియు, నందుచే మహారాజుగారి కాశౌచము లేదనియు నిన్నటి వైదికసభలో నిర్ణయింపఁబడినది.

న్యాయా—అట్లయిన మన మిపుడు చేయవలసిన దేమి?

విద్యా—ప్రాణహానిఁ జేయు దురాత్ములు, గ్రామనాశనముఁ జేయునృశంసులు, సతులశీలముఁ బాడుచేయు పాపాత్ములు—ఇట్టివారిని వాది

తటస్థముకానప్పుడు రాజు స్వయముగా విచారించి శిక్ష విధింపవలె నని యున్నది.

న్యాయా — అవును. పాలకా! సాక్షులు సిద్ధముగా నున్నారా?

పాల — చిత్తము.

యువ — (ప్రవేశించి) కటకటా!

చ. తలఁపున నాతలం పెఱిఁగి ♦ దైవము కేలను బెట్టినట్టి య
వ్వేలఁదుకఁ గోలుపోయిన వి♦వేకవిహీనతకై క్షమింపనా?
నలువురినోళ్లలోఁ బడఁగ ♦ న్యాయసభాస్థలి నిల్పినట్టి య
బ్బలితపుఁ గర్మపాశమును ♦ భావమున న్దలపోసి కుందనా?

తులసివనమందుఁ బుట్టిన గంజాయిమొక్కవలెఁ బరమపవిత్రమైన సిరులకుందుఁ బాపి నగు నేను జన్మించితిని. (ఆలోచించి) కాదు, కాదు. నేను పొరఁబడితిని. దిగంతవిశ్రాంతకీర్తివంతమైన యీపావనవంశము నాకతమున నెట్లు దూష్యమగును?

గీ. మంచికులమునఁ బాపి జ♦నించెనేని
వాఁడె చెడుఁ గాని చెడు నెట్లు ♦ వంశమెల్ల?
చెట్టునను నొక్కచెడుకాయ ♦ పుట్టెనేని
నదియె చెడుఁ గాని చెట్టు పా♦డగుట యెట్లు?

కావున నిదియెల్ల నాచరిత్రమునకే గాని వంశమునకుఁ గాదు. (పైకి) ఆర్యులకు నమస్కారములు.

(అందఱు లేచి నిలుతురు.)

న్యాయా — మీకు స్వస్తి యగుఁగాక! దయచేసి యయ్యాసన మలంకరింపుఁడు.

యువ — (కూర్చుండును.)

న్యాయా — (దండపాశికునితో) మీరు తెచ్చినసమాచారమును ఘుటిల వినిపింపుఁడు.

దండ—చిత్రము. కళింగరాజపుత్రి గోదావరిలోఁ బడి బలవన్మరణము నొందె నని మహారాజుగారికిఁ దెలియవచ్చినందున- మహారాజుగారిచే నాజ్ఞాపింపఁ బడినవాఁడనై నే నారాజపుత్రిమందిరమున కరిగితిని. అచట నామెసఖి యగులలితాంగిసాక్ష్యమువల్లను, నాయింట దొరకిన చిత్రఫలకమువలనను, రాజపుత్రి యవసానకాలమందుఁ బలికినవాక్యమువలనను యువరాజుగారి మరణమునకు హేతుభూతమైన క్లెంచి యీసమాచారమును మహారాజుగారికి నివేదించితిని.

న్యాయా—వా రేమనిరి ?

దండ—“ అర్థిప్రత్యర్థు లెట్టివారైనను వ్యవహారము విధ్యుక్తముగా నడుపవలసినదే. దోషి యగునేని యతఁడు నాకుమారుఁడైనను దండనార్హుఁడే. నిర్దోషియేని సతనిఁగప్రాణైనను వాఁడదు ” అనుచు నాసమాచారపత్రికపై నెద్దియో వ్రాసి తమకడ కంపిరి.

న్యాయా—మంచిది. పాలకా! లలితాంగిం బిలువుము.

పాల—(అట్లు చేయును.)

లలి—(ప్రవేశించి తనలో) ఎంతశ్రమపడినను మాట దక్కినది కాదు సరి కదా! వాడిపోవు ననుశంకచేఁ బూవును సైతము ముట్టనంతటి దయామయు లగుయువరాజుగారిపైఁగూడ నేర మారోపింపఁబడిన దఁట! దండపాశికుఁడు దరియాప్తునకు వచ్చినపుడు అతిదుఃఖవివశతనై యేమేమో చెప్పియుంటిని. అందుచేతనే యింత మూఁడియుండును. (పైకి చూచి) మహాభాగా! నీపట్ల నే నొనర్చినయపరాధములకు లెక్క లేదు కద!

సీ. మాఱువేషంబున ♦ మసలుచుఁ గైతవ
స్నేహంబుఁ బెంపుగాఁ ♦ జేయు టొకటి
విరిదోఁటబాటల ♦ విహరింపఁగా వేడ్కఁ
బుట్టించి నిన్నుఁ గొం♦పోవు టొకటి

కూర్మిఁ గల్గించి పూఁగుత్తికై చెట్టెక్కి-
పురువు ముట్టె నటంచు ♦ బొంకు టొకటి
యోగినిమిషచేత ♦ నొంటిగాఁ జిత్రాంగి
భవనంబునకు నిన్నుఁ ♦ బంపు టొకటి
గీ. అవి యివి యనంగ శేల నాయుతరాత్రి
యెఱుఁగు నేనాచరించిన ♦ వెల్ల; నిట్లు
మిత్రుల నిన్నేచఁగా నెంచి ♦ మిత్రవేష
మూని వచ్చినపగదానఁ ♦ గానె నేను.?

వైద్యముఁ గ్రొత్తగా నేర్చుకొనినవానిచేలిమందువలె నాయొకొ చన మొకరిని జంపి మఱియొకరి నాస్థితికిఁ దెచ్చినది. ఇప్పు డెంత యేడ్చిన నేమి లాభము ? ఇఁక ముందుసంగతి నాలోచింపవలెను. రహస్యము బయటఁ బెట్టవల దని యువరాజుగా రెంతయూ మో చెప్పిరి. కావున, నిచట నేనఁ దెలివిగా నుండవలెను.

(అని ముందుకు నడచును.)

న్యాయా—పాలకా ! ప్రమాణవచనముఁ జెప్పించుము.

పాల—చిత్తము. (లలితాంగిని సమీపించి) ఈసువర్ణమును జేతఁ బట్టు కొని నేఁ జెప్పినట్లు చెప్పుము. భగవంతునిసన్నిధానమందువలెనే-యీ యధికృతులసన్నిధానమందును సత్యముఁ బలికెదను. అబద్ధము పలికితినేని పంచమహాపాతకములుఁ బొందుదును.

లలి—(అట్లే పలుకును.)

న్యాయా—నీ పే రేమి ? తండ్రి పే రేమి ?

లలి—నాపేరు లలితాంగి- తండ్రి కామపాలుఁడు.

న్యాయా—ఓ లలితాంగీ !

గీ. సత్యము వచింపవేని నిస్సంశయముగఁ
జేసికొన్నపున్నెం బెల్లఁ ♦ జెడు టె కాక

ఘోరనరకంబునం బడి • కందుచుందు
వజ్ఞహితచంద్రు లుండుప•ర్యంత మీవు.

లలి—మొన్నటిసాయంకాలము యువరాజుగారు- తమమిత్రు లొకరు సర్పదష్టులు కాఁగా- యోగినికొఱకు మామందిరమునకు వచ్చిరి.

న్యాయా—(వ్రాసి) తరువాత ?

లలి—యోగిని సర్పదష్టున కారోగ్యముఁ గలిగించి- యువరాజుగారి కొకమూలికఁ దెచ్చియిచ్చెదఁ గూరుచుండు మని చెప్పి చనియె.

న్యాయా—(వ్రాసి) పిమ్మట ?

లలి—అంతలో రాజపుత్రి నన్నుఁ బిలిచి సాయంకాలపుపూజాద్రవ్యములు సిద్ధపఱుపు మన నేను గ్రిందికరిగితిని.

న్యాయా—(వ్రాసి) తదనంతరము ?

లలి—అంతఁ గొంతసేపటికి- "లలితాంగీ ! యెందుఁ బోతివి ? మారాజపుత్రి గోదావరిలోఁ బడుచున్నది ; శీఘ్రముగా రమ్ము" అని యువరాజుగారు కేక వేయఁగా మఱలఁ బైకేగితిని.

న్యాయం—(వ్రాసి) అనంతరము ?

లలి—అప్పటికే సిద్ధముగా నున్న రాజపుత్రి- "వలదు- వల" దనుచు మేము సమీపించుచుండఁగానె గోదావరిలో దుమికెను. ఇంతకన్న నేమియుఁ దెలియదు.

వామ—యువరాజుగా రచటి కెన్నిగంటలకు వచ్చిరి ?

లలి—సాయంకాల మైదు గంటలకు.

వామ—యోగిని విషనివారణ మెట్లు చేసెను ?

లలి—క్షణకాలము ధ్యానించి- స్వస్థత కలిగె నని చెప్పె. అంతట ఆయనకడనుండి వర్తమానము కూడ వచ్చె.

వామ—ఆయోగిని యెచ్చటినుండి వచ్చెను ?

లలి—తెలియదు.

వామ—ఎందుకొఱకు వచ్చెను ?

లలి—రాజపుత్రిచే కన్యాగౌరివ్రతముఁ జేయించుటకు.

వామ—రాజపుత్రి గోదావరిలో దుముకునప్పటి కెన్నిగంట లగును?

లలి—సుమారు రెండుగంట లగును.

వామ—ఈచిత్రము దండపాశికునకు మీయింటనే దొరకినదా ?

లలి—(తనలో) ఛీ ! దురదృష్టము ! దీనిని కాపాడలేకపోతిని. (పైకి) చిత్తము.

వామ—ఆమె గోదావరిలోఁ బడునప్పుడు. "భర్తృదారకా ! నా యీబాలవస్మరణమునకు మీరే కారణభూతులు" అని పలికినదా ?

లలి—(ఊరకొనును.)

వామ—మాటాడ వేమి ?

లలి—చిత్తము.

వామ—(కూర్చుండును.)

విద్యా—ఆమె గోదావరిలోఁ బడునప్పుడు "నా యీబాలవస్మరణమునకు మీరే కారణభూతులు" అని యూరకొనెనా ? మఱి యేమేని పలికెనా ?

లలి—"అయినను అట్టిదుర్యశము మీకుఁ బ్రాప్తింపకుండుఁగాక" అని పలికెను.

విద్యా—దండపాశికునకు దొరకినచిత్ర మెవ్వరిచే లిఖింపఁబడినది ?

లలి—నాఁడును నేఁడును తప్ప దీని నెన్నఁడును నేఁ జూచియుండలేదు.

విద్యా—వ్రతనియమముచేత మీరాజపుత్రికిఁ బురుషదర్శనము గాఁగూడదు కదా ! యువరాజుగారి నెట్లు తోడ్కొనిపోతివి ?

లలి—ఒకరికొకరు కనుపడని స్థలమునకే.

విద్యా—ఆయన వచ్చిన ట్లామెకుఁ దెలియునా ?

లలి—తెలియదు.

విద్యా—ఆమె గోదావరిలోఁ బడుచుండుటకు యువరాజుగారు వారింపఁ బ్రయత్నింప లేదా?

లలి—ఆమెను వారించుట కాయన యతివేగముగాఁ బరుగెత్తిరి; కాని యప్పటికే యామె గోదావరిలో దుమికినది. ఆమెపాటును జూచిన తోడనే యాయన యచటనే మూర్ఛిల్లిరి.

విద్యా—(కూర్చుండును.)

న్యాయా—మహారాజకుమారా! ఆమెను మీ రేమేని యడిగెదరా?

యువ—అయ్యా! నేను భగవంతునిదప్ప యితరుల నడుగవలసినపనిలేదు.

న్యాయా—లలితాంగి! దీనిం జదువుకొని యిందు చేవ్రాలుఁ జేయుము.

లలి—చిత్తము. (అట్లు చేయును.)

న్యాయా—ఇఁక నీ వరుగవచ్చును.

లలి—చిత్తము. (పోవును)

న్యాయా—మహారాజకుమారా! వ్యవహారవశమున మి మ్మొకటి యడుగవలసియున్నది; కావున మమ్ము మన్నింత్రుగాక!

యువ—(తనలో) ఓహృదయమా! నీధైర్యసాహసములను జూపవలసిన సమయ మిదే ఏమా?

క. ఒక్కఁడు తనకై నిర్దయుఁ
డొక్కండ్రను జంపఁ దగునొ, పెక్కండ్రకుఁ దా
నొక్కఁడు జావం దగునో
చక్కఁగ నాలోచనంబు సలుపుము పేర్మిన్.

అది యెట్లందువేని;

సీ. ఇందలివాస్తవ మెల్ల వెల్లడి సేయఁ
దండ్రి దుష్కీర్తిఁ దాళలేక
తత్క్షణంబ త్యజించుఁ దనదుప్రాణంబుల
నవ్వార్త విని దుఃఖితాత్మ యగుచుఁ

దగ్నియుఁ దోఁడనే ♦ తనువు విసర్జించు
నావెన్కఁ గులవృద్ధు ♦ లధికశోక
వివశులై యసురులు ♦ విడతు రన్నాళ్ల నాశ్రి
తావళి కృశియించు ♦ నండ లేక

గీ. కాన నిందలఁ గడతేర్చి ♦ కాని బ్రతుకు
బ్రతుకుకంటెను బుద్బుద ♦ ప్రాయ మౌ శ
రీర మిందఱకొఱకుఁ ♦ బరిత్యజించి
శాశ్వతసుఖంబుఁ గాంచుట ♦ చనును గాదె?

అవన్నియు నటుండనీ!

ఉ. ఆనయ స్వీకరించి నను ♦ ధాధవుఁ డీక్రియఁ జేసె నంచు, న
మ్మానస మెఱుంగలేక నన ♦ బోఁడి నను న్వరియించి వచ్చె నం,
చానడి యే నెఱింగి వల ♦ దం చన నాయమ జచ్చె నంచుఁ జీ
చీ! సభలో స్వయంబుగ వ ♦ చించుటకంటె నసహ్య మున్నదే?

పోనిమ్మదియు నటుండనిమ్ము!

గీ. ఏమె భవదీయసుఖముల ♦ కెల్ల యిక్క
యక్కమలనేత్రఁ గోల్పోయి ♦ నట్టి నీవు
బ్రతికియుండిన క్షితి నేమి ♦ బావుకొందు,
వార్యజనములఁ గడతేర్తు ♦ వంతె గాక!

(ప్రైక) ఆర్యా! అవహితుఁడనై యున్నాను.

న్యాయ—శరత్కాలపూర్ణిమాచంద్రునకుఁ గాలవశమున గ్రహబాధ గలిగినట్లు కళంకరహితు లగు మీపైన సాహసవ్యవహారము సంభ వించినది; కావున మీవలన నుత్తరము వినఁగోరుచున్నాము.

యువ—ఆమెమరణమునకు నేను హేతుభూతుఁడ నగుట యథార్థము.

విద్యా—ఏవిధముగా?

యువ—ఆవివరము మీ రడుగఁ దగనది కాదు. నేఁ జెప్పఁ దగినది కాదు.

విద్యా—అడుగుమన్నది వ్యవహారము కదా!

యువ—వ్యవహారమునకుఁ దగునుత్తర మీయనేయిచ్చితిని.

విద్యా—అట్లయిన మీచిత్తము. (కూర్చుండును.)

న్యాయా—ఇక్కడికి విచారణ పూర్తి యయినది.

వామ—పరిష్కార మగువఱకుఁ బ్రత్యర్థిని విడువకూడదు.

విద్యా—వ్యవహార మెట్టిదైనను బ్రత్యర్థి గౌరవకుటుంబముతోనివాఁడైనచోఁ బ్రతిభువుఁ గొని విడువవచ్చును.

న్యాయా—అవును. మహారాజతనూజా!

సుబుద్ధి—(ప్రవేశించి) అందుల కాయనను బ్రశ్నింప నక్కఱ లేదు. ప్రతిభువుగా నుండుటకు నేను సిద్ధముగా నున్నాను.

న్యాయా—రాజకీయోద్యోగమునం దున్న మీ రెట్లు బూటకాపులుగా నుందురు?

సుబు—అట్లయిన నాపాశమునుండి యిదిగో యిప్పుడే విముక్తుఁడ నగుచున్నాను. (ఒకకాగితముపై వ్రాసి) పాలకా! యీవిన్నపమును మహారాజుగారికి సమర్పించి వా రొసఁగు నానతిం గొనిరమ్ము.

(ఇచ్చును.)

పాల—చిత్తము.

యువ—మిత్రుఁడా! యీమందభాగ్యునికొఱకు నీయుద్యోగ మేల విడచెదవు?

సుబు—అయ్యో! అట్లనెద వేమి? ప్రాణముకంటెఁ బ్రియమైన నా ప్రభువున కెక్కట్టు కలిగినపుడు, నా కీమంత్రిపదవి యేల? చివర కీశరీరముకూడ నవసరము లేదు.

పాల—(తిరిగివచ్చి సుబుద్ధికి కాగితము నిచ్చును.)

సుబు—(చదివి న్యాయాధిపతి కొసఁగును.)
న్యాయా—(చదివి) అట్లయిన నీపత్రముపై వ్రాలు చేయుఁడు.
సుబు—(అట్లు చేయును.)
న్యాయా—(సుబుద్ధి యువరాజులతో) ఇఁక మీరు దయచేయవచ్చును.
యువ—(లేచి తనలో)

చ. జనులు నను న్గుఱించి తమ ♦ స్వాంతములం దెటులేని నెంచనీ
విని యిది శత్రుభూపతులు ♦ వేగతులన్ నను గేలి సేయనీ
మును నను యోగ్యుఁ డంచుఁ దల ♦ పోసెడుబంధు లసహ్యమొందనీ
జనకునికీర్తి నిల్చె నదె ♦ చాలును నాకు సమస్తభంగులన్.

(సుబుద్ధితో నిష్క్రమింతురు.)

న్యాయా—వామదేవా! యీవ్యవహారమున మీయభిప్రాయ మేమి?
వామ—(లేచి) "ఆర్యపుత్ర! నా యీబలవన్మరణమునకు మీరే కారణభూతు" లని పల్కిన యీమె యవసానవాక్యముచేతను, నేనే కారణభూతుఁడ నని యువరాజుగా రంగీకరించుటచేతను, యువరాజుగారి ప్రతిబింబముకూడఁ గలఛాయాపట మామెయింట దొరకుటచేతను, యువరాజుగారియెడ దోషము స్థిరపడుచున్నది. ఆయన యిట్టియకార్య మేల చేయవలసివచ్చిన దనఁగా- మహారాజుగా రీమెను బెండ్లియాడుదు రేని తమతల్లిగారియెడఁ బరాఙ్ముఖు లగుదు రనుతలంపున నావివాహమునకు విఘ్నముఁ గలిగింపఁ దలఁచి యిట్లు చేసి యుందురు. మహారాజుగా రాచిత్రపటమును జూచుటచేతనో లేక దానినిగుఱించి వినుటచేతనో, యారాజపుత్రి వర్తనముగుఱించి యనుమానించి యామెను బరిత్యజింతు రనుతలంపునఁ దాము స్వయముగా వ్రాసియో, పరులచేత వ్రాయించియో యుందురు. ఇఁక నా పటమును ఆమెయింటఁ దాము స్వయముగానె యుంచుట మంచిదని యెంచి, తమమిత్రుఁడు సర్వనష్టుఁ డయ్యె నను వంకఁ బెట్టి, యో

గినిలోని కేగినట్లు ఆయింటఁ బ్రవేశించి, ఆచిత్రపటము నందుఁ జేర్చెరి. వ్రతనియమములో నున్న రాజపుత్రిక ఆసమయమున నెల్లో యీయన కంటఁ బడుటచే సహింపలేక తత్క్షణమే ప్రాణత్యాగ మొనర్చుకొని యుండెను. అందుచేతనే ఆమె యవసానవాక్యము నందుఁ గడపట “పట్టెదుర్యశము మీరుఁ బ్రాప్తించకుందురుగాక !” యనిపలికెను. అందుచే యువరాజుగారు దోషు లనియు, దండనార్హు లనియు నాయభిప్రాయము. (అని తాను వ్రాసినకాగితము నిచ్చెను.)

న్యాయా—విద్యాధరా ! మీయభిప్రాయ మేమి ?

విద్యా—ఆర్య ! వామదేవుఁడు పలికిన దంతయు హేతుకముగా నుండలేదు. ఏమన- సచ్చారిత్రు లగుతమతండ్రిగారు రెండవవివాహముఁ జేసికొన్నంతమాత్రమునఁ దమతల్లిగాఁ యెంచఁ బరాఙ్ముఖు లగుదు రని బుద్ధిమంతు లగుయువరాజుగా రూహించి రనుట యసంబద్ధము. ఆ కారణముచే నామెను జంపఁదలఁచిరయెడల “లలితాంగీ ! మీరాజపుత్రి గోదావరిలోఁ బడుచున్నది; త్వరితముగా ర” మ్మని యనుటకుఁ గాని, ఆమెను వారింపఁ బోయి ప్రయత్నించుటకుఁ గాని, ఆమె పాటువలన నాయన మూర్ఛఁ బొందుటకుఁ గాని యవకాశము లేదు. అపనిందకలిగిన దనుదుఃఖముచేతనో- మఱియొందుచేతనో- యువరాజుగారు ‘నేనేకారణభూతుఁడ’ నని యొప్పికొనినంతమాత్రమున మన మంగీకరింపరాదు. మఱియుఁ జిత్రపట మాయన వ్రాసినట్లు గాని- ఆయనయే నాయింట నుంచినట్లు గాని- చూచినసాక్ష్యము లేదు. అదిగాక, ఆమె యువరాజుగారికింటఁ బడినచో వ్రతభంగ మగును గాని, అంతకంటె నష్ట మేమియు లేదు. వ్రతభంగ మైనచో- వ్రతమును మఱలఁ బ్రారంభించి పూర్తి చేసికొననలెను గాని ప్రాణత్యాగ మెందులకు ? ఇంతకును రాజపుత్రి మృతశరీర మగుపడలేదు. మృతశరీర మగుపడనప్పు డామె మృతిఁ జెందె ననుట కవకాశము లేదు; కావున

యువరాజుగారు దోషు లని యెంచుట సమంజసము కాదు. ఇఁక నా
మె యట్టిసాహస మేల చేసె ననఁగా—

స్త్రీలు సామాన్యముగాఁ జంచలస్వభావలు. జగన్నయనోత్సవకర మగుయువరాజుగారి యాకృతిని యామె యెప్పుడో చూచి యుండును. అందువలన నామెమనస్సు విరుద్ధమార్గము ననుసరించి యుండును. దానిని నెఱవేర్చుకొనుటకు సాధనముగా నాచిత్రపటమును ఆమె వ్రాసియుండును. తనమిత్రుఁడు సర్వదక్షుఁడు కాఁగా- యోగినియందలి నమ్మకముచేత- నితరులను బంపుటవలనఁ దృష్టి లేక తామె స్వయముగా వెళ్లి, విషబాధ నివారింపఁ జేసిరి. బాలికనిమిత్తము యోగిని లోని కేగినపిమ్మట రాజపుత్రి యెట్లో యాయనను జూచియుండును. యౌవనము- ఏకాంతము- స్వాతంత్ర్యము—యీమూడును నాసమయమున నామెకడఁ గలవు. అట్టిసమయమున సుందరుఁడైనపురుషుఁడు కంటఁబడినపుడు స్త్రీలు ఏమిచేయుటకు సాహసింపరు! కావునఁ జిత్రఫలకమువలనను, తన యితరచేష్టలవలనను, మాటలవలనను, రాజపుత్రి తనభావము నాయనకడ వెల్లడించియుండును. యువరాజుగారు నీతివర్తనులు కావున పంపుల కంగీకరింపక యుండురు. అందుపైఁ దనయభిమతము యీడేరలేదనియో అది క్రమముగా మహారాజుగారివఱకుఁ బ్రాఁకునని భయపడియో- ఆమె ప్రాణత్యాగముఁ జేసికొనియుండును. అందుచేతనే "అట్టిదుష్కృత్యము మీకుఁ బ్రాప్తింపకుండుఁ గాక!" అని యామె పలికెను. మఱియు నారహస్యమును వెల్లడించుట కిష్టము లేకనే యువరాజుగారు- కారణభూతులు తమ రైనట్లు అంగీకరించి, తద్వివరమును జెప్పరైరి. కావున యువరాజుగారు నిర్దోషులని నాయభిప్రాయము. (అని కాగితము నిచ్చును.)

న్యాయా—(పుచ్చుకొని) నాయభిప్రాయమునుగూడ వినుఁడు:

కళింగరాజపుత్రి యద్వితీయసౌందర్యవతి యనియు, విజయ భూపతియంతవాఁడుకూడ నామెను మోహించి నిరాకరింపఁబడె ననియు విని యుండుటచే యువరాజుగారు, ఆమె నెట్లయినఁ జూడవలె నని తలంచి- మిత్రునకుఁ బాము కఱచె ననుమిషచే యీవేషభవన మునఁ కరిగియుందురు. అదివఱకే తమునకు జేసికొనిన లలితాంగి సహాయమునఁ రాజపుత్రిం జూచియుందురు. యువరాజగారు సద్వ ర్తను లనుట కేమియు సందియము లేదు ; కాని యౌవనదోషముచే నామెను మోహించి తమయభిప్రాయము నామెకడ వాగ్రూపము గాను- క్రియారూపముగాను వెల్లడించి యుందురు. అందుపై నామె యయ్యవమానము సహింపలేక ప్రాణత్యాగమునకు సాహసించి యుండును.

విద్యాధరులవారు చెప్పినట్లు రాజపుత్రియే యాయనను గా మించె ననుట యసందర్భము. ఏమనఁ, గ్రొత్త పురుషునికడ నేస్త్రీయును అట్లు వెల్లడించి యుండదు. రాజపుత్రి గోదావరిలోఁ బడునప్పుడు యువరాజుగారు లలితాంగిని కేకవేయుట- తమ్మె వ్వరు ననుమానింపకుండుటకే గాని- యామె వచ్చి రక్షించు నని కాదు. ఏమందురా? దగ్గఱనున్న తమరే రాజపుత్రిని వారింపలేనపు డు, ఎక్కడనో యున్న లలితాంగి వచ్చి వారించునా? కావున యు వరాజుగారు దోషు లనియు, దండనార్హు లనియు నాయభిప్రాయము.

లిఖితరూపములతో నున్న యీ మనయభిప్రాయములను మహా రాజుగారికి పంపెదను.

ఇది షష్ఠాంకము.

---



శ్రీ మేధాదక్షిణామూర్తిపరబ్రహ్మణేనమః

# చిత్రాభ్యుదయము.

## సప్తమాంకము.

[ప్రవేశము: వధ్యచిహ్నములతో యువరాజు, ఆయుధములతో రోషణుఁడు, డిండిమతో ఘోషణుఁడు]

ఘో — (డిండిమము వాయించుచు)

సీ. ప్రవిమల చాళుక్య • వంశంబునందు ను
దంచితస్థితి నుదయించి రెవరు
శ్రీవిష్ణువర్ధన • క్షితిపాలశేఖరు
పౌత్రులై సత్కీర్తిఁ • బడసి రెవరు
రాజరాజనరేంద్ర • రాజదేవేంద్రికు
మారులై సంపద • మలసి రెవరు
నన్నయగురుదయా • భ్యున్నతి సర్వవి
ద్యాపరిపూర్ణులై • దనరి రెవరు

గీ. అట్టియువరాజుగారు చి • త్రాంగిగారి
ప్రలయమునకుఁ గారణు లని • ప్రభువువారు
మరణశిక్ష విధించి రే • మరక దీని
సాధువర్తనఁ గనరయ్య • జనములార!

యువ—(విచారముతో) చూచునంతవఱకు హృద్యమగా నుండు
టచే నయ్యో! సారంగధరచరిత్రమా! యెంతలో ముగింపునకు
వచ్చితివి?

సీ. ఎన్నఁడో రాజనై ♦ యెల్లరాజుల గెల్చి
కప్పంబులను బొందఁ ♦ గల్గుదు నని
కన్నబిడ్డలవలెఁ ♦ గనుఁగొంచుఁ గాఁపులఁ
గూఁడిమిఁ బాలింప ♦ నేరుతు నని
విద్యావిహీనులు ♦ విత్తహీనులు నాదు
క్షితిలోన లేకుండఁ ♦ జేయుదు నని
ఘోరదురాచారము ♦ లుండించి సంఘసం
స్కారము ల్గావింపఁ ♦ జాలుదు నని
గీ. తలఁచితిని గాని సుంతయుఁ ♦ దెలియనైతి
బహుతరంబైన దుష్కృత్య ♦ పాలు జేసి
దైవ మదయాత్ముఁడై కన్న ♦ తండ్రిచేత
నిట్లు నాతలఁ దఱిగింప ♦ నెంచు ననుచు.

మ. జననీ! నాయెడఁ బ్రేమ పీడుము; మన♦స్తాపంబుఁ జాలింపు మో
జనకా! స్నేహితులార! నాకొఱకు లే♦శంబు న్విచారింపఁగా
జన; దోసేవకులార! నన్మఱువుఁడీ; ♦ శత్రుక్షమాభర్తలా
ర! నిరాటంకముగా మెలంగు చిఁక ని♦ద్రాసౌఖ్యము న్బొందుఁడీ.

కోట—అయ్యా! తొలఁగుఁడు! తొలఁగుఁడు!

గీ. జనవిభుని శాసనము దైవ ♦ శాసనంబు
కంటె నెక్కుడ దెట్లనఁ ♦ గానఁబడక
యెపుడో బాధించు నయ్యది ♦ యిద్ది కాసఁ
బడుచు నిప్పుడె బాధించు ♦ భయదలీల.

యువ—ఎంతటివారి కయినను గష్టములు దొంతరదొంతర లై వచ్చుట యుఁగూడఁ గలదు; కాని నావలె దుర్యశముసకు లోనై, దుర్మరణ ము నొందువారుమాత్రము ప్రపంచమున నొక్కరును నుండఁబోరు. నిరపరాధి నగు నా కీదుర్భరకష్టము లేల కలుగవలెను? (ఆలోచించి) అయినను నిరపరాధి ననిమాత్ర మె ట్లనఁదగును?

గీ. ఎవరియుసురులు గొంటినొ ♦ యెవరి కేమి
యెగ్గు సలిపితినో తొల్లి ♦ యెఱుకమాలి
కాకయుండిన నూరక ♦ కరము చిన్న
నాఁడె యీరీతి నాయువు ♦ మూఁడఁబోదు.

(స్మృతి నభినయించి) ఏదియో యన నేల?

గీ. అన్నెమును బున్నెము నెఱుంగ♦నట్టి గోల
ననుపమసుశీల నావేళ ♦ నట్లు గంగ
పాలు గావించితిని దయ ♦ మాలి యకట
చాలదే కట్టి కుడుపంగ ♦ జడుని నన్ను?

రోష—పౌరులారా! పొండు; పొండు. ఇది క్రొత్తసంగతి కాదు.

గీ. లేవడి భరింపఁగా లేక ♦ జావఁ గోరు
పేదసాదల కేలనో ♦ రాదు చావు;
కలుములుం గల్గి యోగ్యత ♦ కలిగి ప్రజల
కిష్టుఁ డగువాఁ డదేలనో ♦ యిట్టె చచ్చు.

యువ—

చ. సిరులకు నాటపట్టు లయి ♦ చేరలకంటెను బెద్ద లై, మనో
హరరుచు లీనునేత్రముల ♦ నల్లన విచ్చి, సవిభ్రమంబు లై,
సరళము లై, స్థిరంబులయి ♦ సాంద్రము లై నకటాక్షపంక్తులం
బరపుచు నామె న న్ననుపు ♦ భాగ్యము వెండియుఁ గల్గఁబోదుగా!

అయినను, సంతోషింపవలసినసమయమున విచారించుచుంటినేమి!

గీ. ఆమె లే దనుచింత పు♦త్రాగ్ని పురము
నందలిపదార్థమును బోలె ♦ డెందమును ద
హింపఁ గృశియించి కృశియించి ♦ యెపుడొ చచ్చు
కంటె నిప్పటిచావె సు♦ఖంబు నాకు.

రోష—ఔనయ్యా ! మన మేమి చేయఁగలము ? పొండు ; పొండు ;
యీపాటికి తిరిగి పొండు !

యువ—ఓహో పౌరులకు నాయం దెంత యనురాగమో కదా ?

సీ. కన్నీరు మున్నీరు ♦ గాఁ గారఁ వలువలఁ
దుడుచుకొంచును వెంట ♦ నడుచువారు
గుంపుగాఁ గూడి నా ♦ గుణముల నెన్నుచుఁ
బోఁడిమి వాయ వా♦పోవువారు
క్రొత్తగా విని వింతఁ ♦ గొని యెంతదారుణ
మనుచు ఔమ్ములు మోదు♦కొనెడువారు
కటకటా ! మనరాజు♦గా రింతనిర్దయు
లా యని గుదగుద ♦ లాడువారు
పరుగుపరుగున వచ్చి నా ♦ పాటుఁ జూచి
వెలవెలం బోయి రాతిబొ♦మ్మలవితాన
నట్టె నిలిచెడువారు ; నే ♦ మందు నెల్ల
రిన్నిరూపుల వగ నొందు ♦ చున్నవారు.

రోష—ఓరీ ఘోషణా ! మఱల నొకసారి ఘోషింపుమురా !

ఘోష—(డిండిమము వాయించి)

సీ. పరివిమలచాళుక్య♦వంశంబునందు ను
దంచితస్థితి నుద♦యించి రెవరు
శ్రీవిష్ణువర్ధన♦క్షితిపాల శేఖరు
పౌత్రులై సత్కీర్తిఁ♦బడసి రెవరు

రాజరాజనరేంద్ర♦రాజదేవేంద్రు
మారులై సంపద ♦ మలసి రెవరు
నన్నయగురుదయా♦భ్యున్నతి సర్వవి
ద్యాపరిపూర్ణులై ♦ తనరి రెవరు_
అట్టి యువరాజుగారు చి॥ త్రాంగిగారి
ప్రియయమునకుఁ గారణు లని ♦ ప్రభువువారు
మరణశిక్ష విధించి రే♦మరక దీని
సాధువర్తనఁ గనరయ్య ♦ జనములార !

(తెరలో) ఛీ ! ఛీ ! మూఢుఁడా ! మఱియొకసా రిట్లు ప్రేలుదువేని; నీ నాలుకను వాలుకలు గావింతును సుమా ! ఒకవేళ రాజశాసన మందువేమో ?

ఆ. ఎంతదనుక ధర్మ ♦ మెద నిల్పు ధరణీశుఁ
డంతదనుక నతని ♦ యాజ్ఞ చెల్లుఁ,
గడచె నితఁడు దాని ♦ గాన నేను నడుముఁ
గట్టినాఁడఁ గత్తిఁ ♦ బట్టినాఁడ.

రోష.—(విని యులికిపాటుతో) అయ్యా ! విలోకింపుఁడు ! ఒఱనుండి లాగఁబడినకరవాలము కేలం గ్రాల- లయకాలకంఠునివలె సుబుద్ధిగారు భయంకరాకారులై యిటు వచ్చుచున్నారు.

యువ.—(తనలో) నావృత్తాంతము వినికావలయు నీతఁ డీదృశాకారముఁ దాల్చినాఁడు. ఔరా ! స్నేహమహిమ! (ఆలోచించి)

చ. పడయఁగవచ్చు నేరుపున ♦ భాగ్యము ; భాగ్యముచేత బంధులన్
బడయఁగవచ్చు ; నట్లనె ప్ర♦పంచమునందు సమస్తవస్తులం
బడయఁగ మార్గము ల్గలవు ♦ ప్రాణసఖుం బడయంగమాత్ర మె
య్యెడలను దారి లేదు ; పర♦మేశ్వరుఁడే సమకూర్పఁగావలెన్.

సుబుద్ధి.—(ప్రవేశించి) ఓ ఖడ్గరాజమా !

చ. కలన మదీయశత్రుజన•కంఠవిలుంఠన మాచరించి, ప్ర
జ్వలదురుకీర్తిదీధితులఁ • జాల నను న్వెలయించి తీవ్ర మున్ ;
గలిగెను నేఁడు వెండియు స•ఖండతరం బగుకార్య మొండు ని
స్తులగతి మించు నీతెగువఁ • జూపి కడుంజరితార్థుఁ జేయుమా !
(యువరాజుం జూచి) కటకటా ! యితఁ డేనా ? నాప్రియమి
త్రుఁడు !

సీ. దుష్టజంతువు లైన • దోరింప నొల్లని
యతులితభూతద•యామయుండు
పగవారి కైనఁ దో•డ్పడి మేలు గావించు
పరమోపకారసం•భరితగుణుఁడు
నవ్వుల కైన నె•న్నఁడు బొంకులాడని
యత్యంతనిత్యస•త్యవ్రతుండు
కలనైనఁ బరకల•కఁతకంతులఁ గంటఁ
బరికింప నొల్లని • భద్రయశుఁడు
అట్టి సారంగ ; ధరుఁడు రా • జాజ్ఞచేత
వధ్యభూమికిఁ గొంపోవఁ • బడుచునుండె
నడ్డుపడ వేమి ? రక్షింతు • నన వ దేమి ?
దైవమా ! యింతనిర్దయా•త్వంబు తగునె ?

యువ—మిత్రమా ! అసమయమున వీరరసముం గురియుచుంటి వేమి ?

సుబు—ఇది నీశాంతరసమున కసమయము - కాని నావీరరసమునకుఁ గాదు.

యువ—వీలుగానిపట్టున వీరరసమున కెడ మీయరాదు కదా ?

సుబు—(రోషముతో) సుబుద్ధి జీవించియుండఁగా వీలుగాని పట్టన నెట్టిది ?

ఉ. చిన్నటనాటనుండియును • జేసినసంగిడికిన్ ఫలంబుగా
మన్ననమీఱ నీవు నను • మంచినదానికి సార్థకంబుగాఁ
గ్రన్నన నాదుపాటవముఁ • గన్పఱుప న్సమయంబువచ్చె ; నా
విన్నప మూలకించి కడు • వేగమె యానతి యిచ్చి పంపుమా!

యువ—ఎచ్చటికి ?

సుబు—ఎచ్చటకా ? మహారాజుకడకు.

యువ—ఎందులకు ?

సుబు—ఎందులకా ?

చ. మనమున నించుకేని నను•మానము లేక నిజాపరాధమున్
గనఁబడకుండ దాచి; నినుఁ • గల్మషహీను వృథా వధింప శా
సన మతఁడేక్రియ న్నలుపఁ • జాలెనొ ! యెట్లది చెల్లునో ! కనుం
గొనియెద; నాదుప్రజ్ఞ బుధ•కోటికిఁ దెల్లముగా నొనర్చుచున్.

యువ—పాపము శాంతించుఁ గాక ! (తనలో) ఆదుఃఖసమయమున సర్వము నీతనికి వినిపించితిని. అది గొప్ప పొరపాటు. (పైకి) నా మీఁదిప్రేమ నిన్ను మర్యాద నతిక్రమింపఁజేయుచున్నది సుమా!

సుబు—ఇం దయుక్తమే మున్నది ? నేను భృత్యుఁడను, నీవు నా కధిపతివి. కావున, సర్వవిధముల నిన్ను వర్ధిల్లఁజేయుట నాకు విధి.

యువ—నీవు పలికినది యథార్థమే ! కాని- జరిగినసంగతులను దాచి తప్పుచేసినట్లు లనుమతించినందున- తండ్రి నా కీవిధిని శిక్ష విధించెను. ఇం దాయనత ప్పేమి యున్నది ?

సుబు—నే ననేకవిధముల బోధించినను వినక నీ వట్లు దోషము పైన వేసికొనుట తగునా ? మంత్రి వారించినకార్యము మహీపతి యాచరింప వచ్చునా ?

యువ—నీపలుకులను మీఱరాదని యెఱుంగుదును; కాని తండ్రిగారికి దుర్యశము దాపరించు నని యిట్లు చేయవలసి వచ్చినది.

సుబు—అది యేటిమాట ? మిగతసంగతుల నాలోచింప వలదా ? అటు చూడు. నీపాటుం జూచి యెందఱెన్ని విధముల వాపోవుచున్నారో !

యువ—(చూచి) అవును. అయినను మించినదాని కిప్పుడు వగచి నేమిలాభము ?

సుబు—(రోషముతో) ఏమి మించినది ?

గీ॥ సమ్మతింపుము నే నేగి ♦ క్షణములోన

యువ—(చెవులు మూసికొని) శివ ! శివ ! పైమాట నీ వనఁదగిన యుం గాదు నే వినఁదగినదియుం గాదు.

సుబు—పోనిమ్ము—

ఇందలియథార్థ మంతయు ♦ నెఱుఁగఁజేసి
జనులఁ ద్రిప్పుదు మనపక్ష♦మునకు దాన
సిగ్గుపడి తేఁడు నిను పీడు ♦ శీఘ్రముగను.

యువ—ఏమి నీవెఱ్ఱి ? ధర్మసభయం దీసంగతినంతయు దాచి- కత్తి మెడమీఁదఁబడునప్పుడు వెల్లడించిన-నోరువెలితియే గాని నమ్మువా రెవరు ? ఒక వేళ నమ్ముదు రని యూహింపుము ! అయ్యపకీర్తి కోడి తండ్రిగా రాత్మహత్యఁ జేసికొనక మానరు. అప్పు డావిధముగా నా మెడ గోల్పోయియిప్పు డీవిధముగాఁ దండ్రినిగోల్పోయి, నే నొకండనుమాత్రము బ్రతికి యనుభవించున దేమి ?

సుబు—నీ యీసాహసము నీతండ్రిగారికిని నీకునుగూడ ననర్థకమే ! ఏ మందువా ? దోషములేని నిన్ను దండించుటవలన నీతండ్రియును లేనిదోషమును మీఁదవైచికొని యాత్మఘాతి వైన నీవునుగూడ నధోలోకమున కేగుదురు.

యువ—అది సరికాదు.

గీ. తప్పుచేసితి నన నాకు ♦ దండనంబు
నలిపెఁ గావునఁ దండ్రికిఁ ♦ గలుగ దఘము,

కడఁగి జనకునికై మేను ♦ విడచుచుంటిఁ
గాన నాకును బాపము ♦ కలుఁగఁబోదు.

సుబు—వెఱ్ఱివాఁడ ! నీవు దాఁచినంతమాత్రమున నిది దాఁగునది కాదు.

గీ. దారుగతవహ్నియును సము♦ద్రంబులోని
బాడబంబును బైటకు ♦ వచ్చుచుండ
మానవుని చంచలం బగు♦మానసమున
నుండురాహస్య మెట్లు రా♦కుండు పైకి.

(తెరలో) గీ. విని తనకుమారు సంగతి ♦ విపులదుఃఖ
భారమున దేవి ప్రాణముల్ ♦ బాసె నకట !

యువ—(విని) హా ! జననీ ! (అని మూర్ఛవోవ)

సుబు—(పట్టుకొని) కటకటా ! ఎంతకష్ట! మెంతకష్టము !

యువ—(లేచి) హా తల్లి ! సాధ్వీమతల్లి !

సుబు—నే ననలేదా ? ఇంకను నీకొఱ కెందఱు ప్రాణములు విడుతు రో యోజించుకొని యిఁకనైన నీబుద్ధిని మఱల్చుకొనుము.

(తెరలో) గీ. ఈశ్వరానుగ్రహంబున ♦ నెట్టు లెటులో
పడసె నాయమ వెండియుఁ ♦ బ్రాణములను.

సుబు—వయస్యా ! మన మదృష్టవంతులము. అమ్మగారికి మఱలఁ బ్రాణములు వచ్చినవఁట !

యువ—మిత్రుఁడా ! ఆమెకు నీవు రెండవకుమారుఁడవు గదా ! కాఁబట్టి శీఘ్రముగాఁ బోయి యోదార్పుము.

సుబు—(తనలో) ఎంతచెప్పినను యీతఁ డంగీకరించునట్లు తోఁచదు. వ్యసనథియు లేదు. కాఁబట్టి, యీతనియంగీకారముకొఱకుఁ జూడక కర్తవ్యమునకుఁ గడంగెదను. (ముందుకు నడచును.)

యువ—మిత్రమా ! నాకొఱకుమాత్ర మేమియుఁ దొందర పడవలదు సుమా ! (అని తెరలోనికిఁ బోవును.)

సుబు—(తనలో) తండ్రిగారు తీర్థయాత్రకై పోవుచు- నేను సాగనంపి సెలవుగైకొని మఱలి వచ్చునప్పుడు- నన్ను వెనుకకుఁ బిలిచి,

గీ. తరతరంబులనుండి యీ ♦ ధరణిపుత్రులకు
మనకుఁ గలదు సంబంధము ♦ మఱియు వీరి
కొఱకు మనవార లుసురులు ♦ గూడ లెక్క-
సలుపలే దిది మనముఁ ♦ దలఁపు మెప్పుడు.

అని సెల విచ్చిరి కద ! ఆయన వచ్చి నాకొఱకు లజ్జపడకుండ సలుపవలెను.

గుణదేవుఁడు— (మాఱువేషముతోఁ బ్రవేశించి తనలో) ఓహో ! ఏమి నావేషమైపుణ్యము ! ఈతఁడుసైతము చేరువకు వచ్చినను నన్ను గుర్తింపలేకపోయెను. (జనాంతికముగా) కుమారా ! ఒక రహస్యము (చెవిలోఁ జెప్పి పోవును.)

సుబు—ఓహోహో ! యికఁ న్వస్థపడవచ్చును. (నిష్క్రమించును.)

యువ—రోష—భీష—(ప్రవేశింతురు.)

(తెరలో) హా కుమారా ! హా సుకుమారశరీర ! పాపపువిధి నీపట్ల నెంత పగఁ బూనెనురాతండ్రీ !

యువ—అమ్మగారి కంఠస్వరము వలె నున్నదే ?

రోష—చిత్తము. దండన విధించినవెనుక మహారాజుగారు- సాంప్రదాయాను సారముగా- మిమ్ములను బిలిచి " నీవాంఛిత " మేమని యడుగ " మాతల్లిగారి నొకసారి దర్శింపఁ గోరెద " నని తెలిపితిరి. అందువలన మిమ్ము నమ్మగారి భవనముకడకుఁ దోడుకొని వచ్చితిమి.

యువ—ఈస్థితిలో నే నిచ్చటకు రాఁదగినది కాదు. (ఆలోచించి) కాని మ్ము. మించినదాని కిప్పుడు విచారించిన నేమిలాభము. అన్నిటి కిని భగవంతునిదే భారము. (పైకి) బంధనములును, వధ్యచిహ్న

ము లును అమ్మగారికంటఁ బడకుండ నానడుమునకుం గట్టిన యుత్తరీయమును విప్పి భుజములమీఁదనుండి కప్పుదురు.

భీష — (అల్లాగు చేయును.)

అందఱు — (ఒకవైపునుండి తెరలోనికిఁ బోవుదురు.)

రత్నాం — (రెండవవైపునుండి ప్రవేశించి) శోకముచేత లోక మంధకారబంధురమైపోయినది. నాముద్దులపట్టి నిటు దోడ్కొనివచ్చుచున్నారని కనకాంగి చెప్పినదే—యేడీ చెప్పుమా ?

యువ — (ప్రవేశించి) అమ్మా ! మందభాగ్యుఁడనైన నే నిదే తుదినమస్కారముఁ జేయవచ్చితిని. (అని పాదములపైఁ బడును.)

రత్నాం — (కౌఁగిలించికొని దుఃఖముతో) హా వినయప్రచార ! చాళుక్యవంశాలంకార ! నీకొఱ కెంతకాలమో నోచిననోములు పాములయ్యెనే ! నీజన్మకాలమున జోస్యులు చెప్పినకథ లన్నియు వ్యర్థలయ్యెనే !

యువ — తల్లీ ! నేను పుట్టలేదనియో- పుట్టినవెంటనే గిట్టితిననియో యనుకొని దుఃఖము మానుము.

రత్నాం — నీవివాహమహోత్సవాదులను జూడవలసిన నేను-నీమరణోత్సవమును జూడవలసివచ్చెనుగా ? ఓ పరమేశ్వరా ! నన్ను గొడ్రాలినిగానైనఁ జేయకపోతివి కదా !

యువ — మనశరీరములు బుద్బుదములవంటివియు, మెఱుపులవంటివియునై యున్నవి. అన్నియు నెఱిఁగిన నీ వింత యజ్ఞానమునఁ బడుచున్న నే నేమి చేయఁగలను.

రత్నాం — కటకటా ! నోరుమాలిన జంతువులసైతము నిన్నుఁజూచి వాపోవుచుండ- నీతండ్రిగారికె సూత్రమైనఁ గనికరములేక పోయెనే ?

యువ — తల్లీ! నా కెందరో మిత్రులుకలరు. వారందఱు నీకుఁ బుత్రులే! వారిం జూచుకొని నన్ను మఱచిపొమ్మ.

రత్నాం— కటకటా! కన్నబిడ్డలయందుఁ గూడ కనికరము లేకుండఁ జేసెడి కలికాలమా! నీ వెక్కడినుండి దాపరించితివి? (ఱొమ్ము బాదుకొనుచు) హరహరా! ఎంతదారుణ! మెంతదారుణము!

యువ—అమ్మా! యేమి నీనెట్టి—

గీ. కనుఁగొన నిమిత్తమాత్రమే • గాక యొకనిఁ
జంపుటకుఁ గాని మఱియుఁ బ్రో•వన్న దృష్టి
గాఁచుటకుఁ గాని యెవ్వఁడు • కర్త సర్వ
శక్తి సంపన్నుఁ డైన యీ•శ్వరుఁడు దక్క.

కాఁబట్టి నీవు తండ్రిగారిని, గాని మఱియొకరిని గాని నిందించుట కేవల మన్యాయము.

రత్నాం—హా! తండ్రి! కన్న దేవతలకెల్లమ్రొక్కి కనిపెంచినది నిన్నిట్లు కత్తిపాలు సేయుటకేనా? అయ్యో! యెంత చెమటపట్టినదిరా తండ్రీ! (పైఁటచెఱఁగుతోఁ దుడిచి) ఇఁక నొకక్షణమునకు నేలపాలగుదునను విరక్తిచేతనా యేమి నేల జీరాడుచున్న తలవెండ్రుకలను ముడుచుకొనవైతివి? (తల ముడువఁ బోవుచు) నాయనా! చేతుల నిట్లు వెనుకకు ముడుచుకొంటివేమి? (పై బట్టఁ దొలఁగించి చూచి) హా తండ్రీ! యిదికూడనా? (మూర్ఛిల్లును.)

యువ—హా! యెంతకష్టము! మెంతకష్టము!

రత్నాం—(తెలివిఁరాగా లేచి) అయ్యో! తండ్రీ! నీతండ్రిగారు నిన్ను పెండ్లికొడుకును జేయించిరా? అబ్బా! నాకన్నులు కాలిపోను—అక్కట! నాపట్టపుదేవితనము పాడుగాను—నాపట్టిని నేను గాపాడుకొనలేక పోతినిగదా! శివ శివా! నే నింక సహింపలేను.

యువ—(తనలో) కట కటా! యెంతకష్టకాలము సంప్రాప్త మైనది!

సీ. నానిమిత్తంబు ప్రా•ణముల నవ్విధమునఁ
బాసినయువతికై • పగతు నొకొ్క—

వాసిఁ గాంచినయట్టి ♦ వంగదంబున కెల్ల
వచ్చిననిందకై ♦ వగతు నొక్కొ
కంటికి మంటికిఁ ♦ గన నేకధారగా
వాపోవుతల్లికై ♦ వగతు నొక్కొ
చిన్నటనుండి చే♦సినచెల్మికతమున
వందురుహితులకై ♦ వగతు నొక్కొ
అఖిలభంగుల లోకహి♦తార్థముగను
సలుపఁ దలఁచినకార్యముల్ ♦ సలుపకుండ
మివ్రుల వ్యర్థుండనై యిట్లు ♦ మేను విడువ
వలసివచ్చుటకై మది ♦ వగతు నొక్కొ?

రత్నాం—ఓ ప్రాణేశ్వరా! ధర్మవిధులు పెక్కువిధములు కదా? యీతని దేశాంతరమునకు వెడలఁగొట్ట రాదా? అచట దిక్కుమాలినవారిలో నొక్కఁడుగానైన నుండునే! అయ్యో! తండ్రీ!

సీ. తాతపేరిట నీవు ♦ తగ నెలకొల్పిన
పాఠశాలను నేల♦పాలు చేసి
స్వయముగా శంకువు ♦ పాతి కట్టించిన
చిత్రశాలను జాలఁ ♦ జిన్నబుచ్చి
పెరసీమజనుల ర♦క్షించి యేర్పఱచిన
నట్టడశాలను ♦ బదటఁగలిపి
పిన్నతనమునాఁడె ♦ ప్రీతితో నిలిపిన
వ్యాయామశాలను ♦ వ్యర్థపుచ్చి
యెంతయును వింతగా వెల♦యించినట్టి
క్రొత్తనాటకశాలను ♦ గూలఁద్రోసి
స్వప్నగతభాగ్యముం బోలె ♦ జనులఁ దుదకుఁ
జింతలో ముంచి పోయెదే ♦ చిన్నితనయ!

(భటులతో) అన్నలార! నాయాజ్ఞకూడ మీ కవిలంఘనీయము గనుక ముందుగా నన్నుఁ గడతేర్పుఁడు.

యువ — అమ్మా! అంతకంతకు నీవు కడు వెఱ్ఱిదాన వగుచుంటివి.

గీ. కలనఁ దనయొక్కసుతుఁ డీల్గ ♦ గాంచి యలసు
భద్ర తా నేమి చేసె? న♦ప్పగిదిఁ దనకు
నూరుసుత మొక్కతఱి యమా♦గారమునను
జేర గాంధారి తా నేమి ♦ చేసెఁ జెపుము?

కాఁబట్టి మానవు ఋణానుబంధము తీఱిన దని భావించి—

సీ. తల్లిరో! నన్నిటు ♦ దండన మొనరించె
నని నాదుతండ్రిపై ♦ నలుగకమ్మ
తనయుఁడు లేనట్టి ♦ తను వేటి కని యువ
వాసము లొనరించి ♦ వాడకమ్మ
పరులబిడ్డలఁ గంటఁ ♦ బరికించి ననుఁ దల
పోసి లోలోనఁ ♦ బొగిలకమ్మ
పలుమాఱు నాదువ♦స్తువులు దుస్తులుం గాంచి
యూరక వెత బొందు ♦ చుండకమ్మ
తొంటివాడుకచే మన ♦ యింట నుండు
చిలుకలును శారికలు నన్నుఁ ♦ బిలువ నాల
కించి మది కించఁ గొంచు దుః♦ఖించకమ్మ
కొడుకునే కనలే దను♦కొనఁగదమ్మ!

రత్నాం— అబ్బబ్బా! నీపలుకులు వినఁజాలను. అయ్యో! నాహృదయము మండిపోవుచున్నది. ఓ పరమేశ్వరా! నామొఱ నీకు వినఁబడలేదా! పుత్రశోకసమాకుల మైన యీసంసారమునం దిఁక నాకేమిసుఖము కలదు. ప్రాణవాయువులారా! యీపాపశరీరము నిఁక విడిచిపెట్టుఁడు. ఓప్రాణేశ్వరా! నాబిడ్డయందువలెనే నాయం

డును గారుణ్యము వీడుఁడు. ఓవీరులారా! మీ రిఁక మీపట్టపు దేవిని మఱచిపొండు. అయ్యో! నా కప్పుడు నిజముగానే కనులు పోయినవి అయ్యో! అయ్యో! నాకుమారుని విడిచి నే నెక్కడికో పోవుచుంటిని భూచక్రమంతయు గిరగిరఁ దిరిగిపోవుచున్నది. అబ్బా! యింతచీఁకటి యెక్కడనుండి వచ్చినది! హా! కుమారా! (వెడగు నవ్వుతో,) నాకుమారుఁడు యింతచీఁకటిలో నెంతచక్కఁగాఁ బ్రకాశించుచున్నాఁడో! (గుండెబాదుకొనుచు) కాదు—కాదు—అదిగో కుమారుని వధ్యశిలపై నెక్కించిరి. ఓరోరి పాపాత్ములారా! చంపకుఁడు!—అదిగో నాతండ్రి నన్ను రమ్మని పిలుచుచున్నాఁడు! నాప్రాణము లెక్కడికో పోవుచున్నవి. హా! తండ్రి! హా. నా - రం - (అని మూర్ఛపోవును).

యువ—కట కటా. యీకరుణారసముద్ర మెవ్వఁ డీఁదఁగలఁడు. "ఓకనకాంగీ! యీమె మిక్కుటమైన మూర్ఛంబొందినది; సత్వరముగా వచ్చి యంతఃపురమునకుఁ గొనిపోయి తగినయుపచారముఁ జేయుము" ఓభటులారా! నన్ను వధ్యభూమికి శీఘ్రంబుగాఁ గొనిపొండు.

రోష—చిత్తము. (యువరాజుతో ముందుకు కొంచెము నడువఁగా వెనుక తెరపడును)

యువ—(తనలో) అవసానకాలమునందు దేనిని జింతింతుమో దానిని బడయుదు మని కొందఱు చెప్పుదురు.; కాఁబట్టి నే నింక నితర చింతలు విడిచి,

ఉ. "చాలును సిగ్గు నీప్రియుని•సన్నిధిఁ జేర్పెద ర" మ్మటంచుఁ గే
ల్కేలను బట్టి లాఁగు సఖి•కే ల్విదలించుచు ; వేఱుకేలితోఁ
జేలము దిద్దుకొంచు, నొక•చెంపకు మో మిడి తాప్రసహర్షము
ల్దాలిచినట్టి యామె తొలి•దర్శన మెల్లపుడున్ స్మరించెదన్.

అందఱు—(నిష్క్రమింతురు.)

ఇది సప్తమాంకము.

# విష్కంభము

మీనసాథాశ్రమప్రాంతము.

దమనుఁడు—(ప్రవేశించి) పుత్రవియోగసంతాపస్వాంతుఁ డగు రాజ రాజనరేంద్రునకు వినోదార్థముగా నాటక మాడింపఁ దలఁచి సమస్త పౌరజానపదసమేతముగా సమ్మహారాజును రప్పించి-భగవత్స్వరూపులగు మీనసాథమహర్షులవారు సన్నుఁ బిలిచి "గోదావరీతీరమునసాటక శాలను నిర్మించి సామాజికులకుఁ దత్తదుచితాసనముల, గూర్చిర" మ్మని యాజ్ఞాపింపఁ జక్కఁగా రంగభూమిని గల్పించితిని గదా! ఇఁక నాసనములను వేయింపవలసియున్నది. అది యెల్లవారిఁ నెఱిఁగినవారి తోడ్పాటుసఁగాక నెఱవేఱదు. కాఁబట్టి యట్టివారి నేరినైనఁ బంపుమని మహారాజుకడకు వర్తమాన మంపితిని. కావున నతఁడు వచ్చునరి కిచ్చ టనే యుండెదను.

వామ—(ప్రవేశించి) మునికుమారా! మీ రెవరికొఱకుఁ జూచుచు న్నారు?

దమ—సామాజికసన్నివేశమునందాసనముల నేయేక్రమమున వేయింపవ లెనో యది తెలుపఁ గలుగువారికొఱకు.

వామ—అట్లయినవినుఁడు. మహారాజుగారి కిరుప్రక్కల సుబుద్ధిగారును, హరిశర్మగారును.

దమ—హరిశర్మగారా! ఆయన విజయభూపతికడ- కారాగారమునం దు న్నారు కదా?

వామ—లేదు. లేదు. విజయసేనుఁడు కొంతపరివారముతో నేగి విజయ భూపతిని నామైకశేషుని జేసి- హరిశర్మగారిని దోడ్కొని యీదినమే యరుదెంచెను.

దమ—అట్లయిన నిరుపరిక్కల వీరియాసనములున్న దేవియాసన మెచ్చట ?

వామ—దేవిగారా ? ఆమె శయ్యనుండి లేవఁగలిగినఁ గదా?

దమ—పాప మాలాగుననా!! మన మిచ్చటఁ దడయరాదు. నాటక శాలకుబోవుదము. అచ్చట మీరు తెలుపుచుండఁగా నే నాప్రకార మాసనములను వేయించెదను.

(నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.





శ్రీ మేధాదక్షిణామూర్తిపరబ్రహ్మణేనమః

# చిత్రాభ్యుదయము.

## అష్టమాంకము.

మీనానాథాశ్రమము నందలి నాటకశాల

[ప్రవేశము:—యథోచితాసనములయందు రాజు, సుబుద్ధి, హరిశర్మ, మున్నగువారు కూర్చుండియుందురు.]

### అంతర్నాటకము.

♦ నాంది ♦

గీ. అరసిచూడ నదీప్రవా♦హంబు కాష్ఠ
ములకువోలె, నెవండు జీ♦వులకుఁ గూర్చు
చుండు నెపుడు సంయోగ వి♦యోగములను
గరుణ నీశ్వరుఁడా తఁడు ♦ గాఁచు మిమ్ము;

ప్రస్తావన.

సూత్ర—(ప్రవేశించి) ఓ సభాసదులారా! "మే మొక గతవృత్తమును గరుణాద్భుతరసనిగుంభితమగు రూపకముగా రచించి దానినేఁడు మా శిష్యవర్గముచేత మీయెదుట యథోచితముగాఁ బ్రయోగంబుసేయింపసంకల్పించితిమి; కావున మాయందునవలెనే యీరూపకమునందును గౌరవముంచి సావధానముగా విలోకింతురుగాక" అనిభగవానులైన మీనానాథమహర్షులవారు మీ కాజ్ఞాపించుచున్నారు.

(తెరలో) ఓగోదావరీ ! నీకు శరణు జొచ్చిన నన్ను- నీలోఁ- జేర్చుకొన
వేమమ్మా ?

ధృవకోకిల. పతియనాదరణంబు సేయఁగఁ ♦ బ్రాణధారణమేటికం
చతిర యంబుగ నీదుగర్భము ♦ నందుఁ జొచ్చిన దాన నీ
మతి దురాత్మగ నెంచి లోఁగొన ♦ మానకమ్మ యిదే నమ
స్కృతు లొనర్చెద నాదుకష్టము ♦ లెల్లఁ దీఱెడు నింతటన్.

సూత్ర— గంగరాజనందన గోదావరిలో మునుఁగుచుఁ దేలుచుఁ
కిన వాక్య మిది.

రాజు— అయ్యో ! అయ్యో ! అమాత్యవర్యా ! లెండు ! లెండు !
మనముపోయి వెలిఁ దీయుదము !

హరి— మహారాజా ! యిది నాటకము. ఆతఁడు గతమును దెలుపు
చున్నాఁడు.

రాజు— (తెల్లఁబోయి) ఆలాగుననా ! వ్రణముపై క్షారోదకము జల్లి
నట్లు నాహృదయమునం దీవఱకే రవులుకొనుచున్న దుఃఖాగ్నిని
మండించుటకుఁ గావలయును గురువుగారీనాటకమును బ్రదర్శించుట ?

తెరలో— ఓశబరనాయకుఁడా ! ఆమె రెండుసారులు మునిఁగినది. నీవు
పడవను శీఘ్రముగా నడిపింపవేని మనము చనిన ప్రయోజనము లేక
పోవును.

సూత్ర— గుణదేవామాత్యులవారు. ఆమెను రక్షించుటకై సత్వర
ముగాఁ బడవను ద్రోయించుకొని పోవుచున్నారు.

రాజు— గుణదేవులవారా ! ఆయన తీర్థయాత్రల కరిగిరి కదా ? ఇం
తటి మహానుభావులు రచించిన గ్రంథముకూడ నింత యసందర్భము
గా నున్న దేమి ?

హరి— తమకుఁ దెలియని దేమున్నది. ఇది యొక కల్పన. కల్పనలేని
కావ్య ముండదు కదా?

తెరలో—ఓయీ! నీ వెవ్వఁడవు? తెగి। నేలం గూలిన చంద్రబింబము వలె నున్న యీయామె యెవ్వతె?

సూత్ర—అదిగో! గుణదేవుల వారామెను గోదావరినుండి యుద్ధరించి మీననాథమహర్షులవారి యాశ్రమమునకుఁ గొనిపోఁగా- నమ్మహర్షి వారిం గూర్చి ప్రశ్న చేయుచుండెను. ఇది గతవృత్తాంతము. ఇఁక వారు ప్రవేశింతురు కావున నేను జనవలెను.

(నిష్క్రమించును.)

ఇది ప్రస్తావన.

---

[మీననాథుఁడు, పరుండఁబెట్టఁబడిన చిత్రాంగి, మాఱువేషముతో గుణదేవుఁడు ప్రవేశింతురు.]

గుణ—మాఱువేషమున నుంటచే నన్ను మీరు గుర్తింపలేదు. నేను గుణదేవుఁడను. ఈమె యెవరో ఆపన్నురాలు- ఆత్మహత్యఁ గావించుకొనుటకు గోదావరిలోఁ బడఁగా - పైకి దీసి యిచటికి దోడుకొని వచ్చితిని.

మీన—నాయనా! నీవటోయి? యెప్పుడు వచ్చితివి? ఏల యిట్లు మాఱువేసమును దాల్చితివి? యీమె యెట్లు నీకంటఁ బడినది?

గుణ—మహాత్మా! నేను సమస్త పుణ్యక్షేత్రములు సేవించి స్వదేశాభిముఖుండనై వచ్చుచు- మహారాజుగారు కళింగరాజనందనను వరించి- యామెను వివాహమాడ రప్పించిరనియు- నామె వ్రతదీక్షలో నుండుటచేత నింకను వివాహము జరుగలేదనియు- విని- వార్ధక్యమునం దీయన కిట్టికోరిక యేల పుట్టెనా యనియు- పుట్టెఁబో- నిరుపమానవమనోరూపసంపన్నురాలగు కళింగరాజపుత్రి యీయన నెట్లను

మతించెనా యనియు- అనుమతించెఁబో-వివాహమున కీయన యేల చనలేదనియుఁ-జనకుండెఁబో- వివాహమునకుఁ బూర్వమె హరిశర్మగా రెట్లామెను దీసికొనిరా సాహసించిరనియు- సాహసించెఁబో-వ్రతదీక్షలోనున్న యామె దీక్షానంతరమే రాకముందుగానే యేలవచ్చెనాయనియు మొదలగు పెక్కు సందియములఁ బొందితిని.

రాజు—(కోపముతో) ఏమిది ?. ఆమెను నే వరించితినా ? అందులకై వివాహమూడ రప్పించితినా ? అమాత్యవర్యా ! ఏమిటి యీయసందర్భము ? అనాఁడు జరిగినది మీప్రయత్నమా ? నాప్రయత్నమా? అదియైనను మీరు కళింగేశ్వరునితో మాట్లాడి వచ్చెదనంటిరా ? కన్యకనే గొనివచ్చెద నంటిరా ?

హరి—మహారాజా ! కల్పనయని మొదటనే మనవిచేసితిని గాదా ?

మీన—తరువాత ? తరువాత ?

గుణ—అందువలనఁ బరివారమును వెనుక దిగవిడచి నేనుమాత్రము చనుదెంచి- యిచ్చటి కుత్తరమున నున్న చెంచుపల్లెలో మాఱువేసమున నివసించుచు నాసందియములం దీర్చుకొనుటకును- నేను లేని సమయమునఁ బ్రజలచిత్తము లెట్లున్నవో తెలిసికొనుటకును - ప్రతిదినము సూర్యుఁడ స్తమించుటతోడనే గూఢముగా రాజధాని కరుగుచు రేయెల్ల నచ్చటఁ గ్రుమ్మరివేకువజామున మఱల నునికిపట్టుఁ జేరుకొనుచుంటిని.

మీన—కావుననే నీమంత్రిశక్తిని లోకమంతగాఁ గొనియాడుచుండును. తరువాత ? తరువాత ?

గుణ—అట్లునేఁడును జనియావలియొడ్డునఁ జేరనున్నతఱి- మా మహారాజుగారు గోదావరీతీరమునఁ గొత్తగాఁగట్టించిన సౌధముచుండి మబ్బునుండి జాఱినమించువలె నీమించుఁబోఁడి గోదావరిలోఁ బడియె. అంతట నేను యీమెను నావపై కెత్తి యీవలియొడ్డునఁ జేర్చ- పాప

ము శబరాంగనయోర్తు నాకు సాయపడి మ్రింగిననీరు వెలువరించి పొడిపుట్టము గట్టినది. పై సంగతి నాకేమియు స్ఫురింపనందున నిచటికిఁ దోడ్కొని వచ్చితిని.

మీన—(పరిశీలించి) శ్వాస మంతగా క్షీణింపలేదు. చైతన్యము త్వరలోనే కలుగవచ్చును. ఇందులకుఁ జికిత్స యాయుర్వేదమునం దిట్లు చెప్పఁబడియున్నది.

సీ. గాలిలో వెలికిలఁ ♦ గాఁ బరుండఁగఁ బెట్టి
బాగుగా నాలుక ♦ పైకిఁ జాపి
ప్రతినిమేషమునకుఁ ♦ బదియాఱుసారులు
వంతున నఱగంట ♦ నఱకు రోగి
నెత్తిదాకను జేతు ♦ లెత్తుచు మఱలఁ గ్రి
క్కల కంటునట్లుఁ ♦ గదియలాఁగి
కాల్సేతికొనలను ♦ గంబళితో రాచి
వేడియిసుకమూట ♦ తోడమేను
గాచి లోపలకు వెట్టఁ ♦ గలుగఁ జేయు
మందులొసగంగవలయును ♦ ముందుగానె
కడుపులోనున్న నీరెల్ల ♦ వెడలఁజేసి
నీటఁ బడువారి బ్రతికించు ♦ సూటియిదియె.

ఇద్దఱు—(అట్లు చేయుదురు.)

చిత్రాం—(కొంచెము తెలివి రాఁగా) ఓగోదావరీ! నీకు శరణుజొచ్చిన నన్ను నీలోఁ జేర్చుకొనవేమమ్మా?

గుణ—అమ్మయ్యా! నేను కృతార్థుఁడను.

చిత్రాం—(విని యులికిపడి కన్నులువిచ్చిచూచి) ఆఁ! యెవరుమీరు?
(చీర దిద్దుకొనుచు నెమ్మదిగా లేచి నిలచును.)

రాజు—ఓహో! యీమె బ్రదికినదే!

హారి—(తనలో) ఓహృదయమా! నీవింకజీవితమునకు నీళ్లు విడువుము. ఓభగవంతుఁడా ! యిచ్చట నాకీ ముప్పు సిద్ధముచేసియే నన్నుఁ గారాగృహామునుండి విడిపించి తెచ్చితివి కాఁబోలును!

మీన—బిడ్డా ! భయపడకుము. మేము తపోధనులము. ఇతఁడు రాజరాజనరేంద్రుని ప్రధానామాత్యుఁడగు గుణదేవుఁడు. నీ వెవ్వరిదానవో యిట్టిగతి యేలపట్టినదో దాపక చెప్పుము.

చిత్రాం—(ఆశ్చర్యముతోఁ- దనలో) ఏమహాత్ముని ప్రజ్ఞావిశేషముల నెల్లదేశములఁ గథలుగాఁ జెప్పుకొనుచుందురో- అట్టి గుణదేవుఁడా యీాయన ! అట్లయిన నాకుపకరించినను లేకున్నను మీారాజిట్టి దుర్ణయమును జేసెనని యీాయనచెవిలో వేయుట యుక్తము. (పైకి) తండ్రులారా ! మందభాగ్యురాలనైన నాదుర్దశ మీాతో నేమని చెప్పుకొందును. ఒకవేళ నందులకుఁ దెగించినను దానిచేత మీాహృదయముల కాయాసము కలిగించుటయే కాని- నాకష్టము మాత్రము తీఱదు. కాన నన్ననుగ్రహించి యింతటనైన నీలోకమును విడువనిండు.

గుణ—(తనలో) సందియ మక్కఱలేదు. నిశ్చయముగా నీమె కళింగరాజనందనయే. (పైకి) ఓసౌభాగ్యవతీ ! కష్టము లెంతటివారికైనను గలుగుచుండును. అయినను ఓర్పుకలిగి సహించుకొనవలెను కాని యంతమాత్రమున నాత్మహత్యకుఁ బాల్పడుదురా ?

చిత్రాం—ఆత్మహత్య పాప మని యెఱుఁగనిదానఁ గాను. మఱి యేమందురా? కులకన్నెలు చావునకైన నోర్తురు గాని శీలభంగమున కోర్వఁ గలరా ?

గుణ—(ఆశ్చర్యకోపములతో) శీలభంగమా ? యెవరివలన ?

చిత్రాం—ఎవరివలననైనచో నది నివారింపఁగుదుట కవకాశము లేనిదగునో అట్టి మీామహారాజువలననే.

రాజు—(చెవులు మూసికొని) పాపము శాంతించుఁగాక! పాపము శాంతించుఁగాక!-నే నీమె నెన్నఁడును గంటితోనైనఁ జూడలేదే. చివర కీమెను గురించి మనసునందైన స్మరియింపలేదే! నావలన శీలభంగ మెట్లయినది? ఏమి యీరూపక మింత యసందర్భముగానున్నది. (హరిశర్మవంకఁజూచి) ఆర్యా! యేమిది యిట్లు వడఁకుచున్నారు?

హరి— నడఁకుచు) మమహా-రారాజా- చచ చచ చలి! చలి! అహా హాహాహాహా- ఉహుహూహుహూహుహూహూ.

రాజు—అయ్యో! పాపము. అడవిగాలి యీయనకు సరిపడదు కాఁబోలు- (సుబుద్ధితో) మహామాత్యకుమారా! ఏమిది గాఁచుచు నూరకున్నాను?

సుబు—(నాడిని హృదయమును బరీక్షించి) మీరు కొంచెము పడకుఁడు. ఇది వ్యాధి కాదు. హృదయమునందేదో భయము ప్రవేశింపఁగా నిట్లు నడఁకుచుండెను. (చిఱునగవుతో) అమాత్యవర్యా! ధైర్యముఁ దెచ్చుకొనుఁడు. మే ముండఁగా మీ కేమిభయము?

గుణ— గీ. సత్యమును శౌచమును దయా • శాంతములును
దనకు దోడుగ నుండ మా • ధరణివిభుఁడు
ప్రజలఁ బాలించునంతటి • ప్రథితగుణుని
నిట్లు లేటికిఁ బల్కెదో • యెఱుఁగఁజాల!

చిత్రాం—అట్లయినఁ దెలిపెద వినుఁడు. కళింగదేశాధీశ్వరులగు యశోవర్మమహారాజుగారికి నే నొక్కతెనే కొమరితను. మీమహారాజుగారు నన్ను వివాహమాడఁ గోరి తాము వయసుచెల్లిన వారగుటచే, హరిశర్మ యను మంత్రిముఖమునఁ దమ మాదున కని సంబంధ మొప్పించి- ఖడ్గవివాహమను మిషచేత నన్నుఁ దమప్రోలికి రప్పించి వివాహమాడుటకు సిద్ధపడిరి.

రాజు—ఏమి? (ఆశ్చర్యకోపములతో) నేను వివాహమాడఁ గోరుట యుఁ, గుమారునకని సంబంధము కుదుర్చుటయుఁ, గుమారునకుఁ గూర్చినకన్యను నేనే వివాహమాడుటకు సిద్ధపడుటయునా? ఏమి విపరీత మిది? పూజ్యులైన గురువుగారుకూడ నింత యసత్యమును గల్పించి రేమి? (హరిశర్మంజూచి) ఆర్యా! యీవాక్యములు మీరు విన్నారు కాదా?

హరి — వి వి వి విన్నానండి- లేలేలే లేదండి- అ అ అ అవునండి- కాకా కా కాదండి.

రాజు—పాప మేమి చేయుదును! యీయనస్థితి యంతకంతకుఁ జెడు చున్నది.

చిత్రాం — అంతట నేను స్త్రీత్వమిషముచేత నది తప్పించుకొని గోదావరీ తీరముననున్న మేడలో నివసించుచుండ- నాకాలికత్తెల సహాయ మున- యువరాజుగారిని నా నెలవున కరుదెంచునట్లుచేసి సర్వము నివేదించితిని. ఆయన లోకమునకును- దండ్రిగారికిని వెఱచి- నన్నుఁ జేపట్టక నిరాకరించెను. అందువలన నే నిట్టి సాహసము సలిపితిని.

రాజు—(చెవులు మూసికొని) గురువుగారు నన్ను శపించినను సరే- నే నిట్టి విరుద్ధపునాటకమును విలోకింపను. (అని లేచును.)

హరి — మహారాజా! పూజ్యులైన మీనాథులవారియెడ దోష మా రోపింపకుఁడు. ఇదియంతయు యథార్థమే.

రాజు—ఏమి? యిదియంతయు యథార్థమేనా?

హరి — యథార్థమే ఆమెను సమకూర్పఁ గలిగితినేని- గుణదేవులవారి కంటె నన్నెక్కుడుగాఁ జూతురను తలంపున- నామెకు యువరాజు గారి పటమునుజూపి భ్రమపెట్టి- తమయింట ఖడ్గవివాహ మాచా రమని వారితోఁజెప్పి- గూఢముగా నిటనుండి కొనిపోయిన యువ రాజుగారి ఖడ్గమునకే వివాహము జరిపితిని.

రాజు—అమాత్యకుమారా! జ్వరవికారముచేతనే కదా యీతని యిట్లుపలుకుట!

సుబు—జ్వరవికారముచేత కాదు. బుద్ధివికారముచేత యీయన నిజముగానే యింతటి సాహసమునకుఁ గడంగెను. తమరు మన్నింపవలెను.

రాజు—అట్లయిన నిందలి పరమార్థ మిదియని చిరంజీవి—హా! చిరంజీవియా?—సారంగధరుఁ డేల చెప్పలేదు?

సుబు—ఈమంత్రము మీరు చేయించితిరను తలంపున మీ కపకీర్తి కలుగునని వెల్లడింపలేదు.

రాజు—హా! కుమారా! హా! వినయపరిచారా! (మూర్ఛిల్లును)

సుబు—ఓర్చుకొండు ఓర్చుకొండు

రాజు—(తెలివిరాఁగా లేచి) ఓ బ్రాహ్మణాధమా! కాదు! కాదు!

గీ. బ్రాహ్మణాకృతిఁ దాలిచి ♦ పరఁగునట్టి
యధముఁడ! దురాత్ముఁడ! కృతఘ్నుఁ ♦ డా! మదీయ
కులమునకు నెల్లఁ జేట్పాటు ♦ కలుగఁజేసి
తిదిగో దానికిఁ బ్రతిఫల ♦ మిప్పుడె కొనుము.

హరి—(మెడచాపి) మహారాజా! కాలము మిక్కిలి సమీపించి గాలము వలెనన్నుఁ బట్టి లాగుటచే నిట్టి యకార్యము నాచరించితిని కావున నన్నుఁ జంపుఁడు.

గుణ—(వచ్చి ఖడ్గమును బట్టుకొని) మహారాజా! శాంతింపుఁడు.

గీ. ఉర్విలో నెట్టి యపరాధ ♦ మొనరిచినను
బడఁతులను శిశువులను గో♦బ్రాహ్మణులను
జంపఁ దగదండ్రు కావున ♦ శాంతమూని
భూమిసురు నీతనిం గృపఁ ♦ బ్రోవవలయు.